# విశ్వసాహిత్యమాల (ముంగండ)

## వెలువడిన గ్రంథములు.

| | |
|---|---|
| *౧. లియోటాల్‌స్టాయి. | ౦—౪—౦ |
| *౨. హిందూదేశము: క్రైస్తవప్రభుత్వనిర్మాణతత్త్వము. | ౦—౮—౦ |
| ౩. ఇటలీ. | ౦—౪—౦ |
| *౪. ఫాసిజం—కమ్యూనిజం—స్త్రీలు. | ౦—౪—౦ |
| *౫. సందేశము. | ౦—౨—౦ |
| ‡౬. కారల్‌మార్క్సు ఉపదేశములు. | ౦—౬—౦ |
| ౭, ౮. సోషలిజం ఎందుకు? | ౧—౦—౦ |
| ౯. నారష్యాయాత్ర. | ౦—౮—౦ |
| ౧౦. సోవియట్‌కమ్యూనిజం (ఏడవప్రకరణము) | ౦—౮—౦ |

## అణా ప్రచురణశాఖ.

| | |
|---|---|
| ౧. సోవియటురష్యాలో సమిష్టివ్యవసాయపద్ధతి. | ౦—౧—౦ |

* ప్రతులులేవు.

‡ నిషేధించబడింది.

విశ్వసాహిత్యమాల-౧౦.

# సోవియటు రష్యాలో జమీందారీ-పెట్టుబడిదారీ విధానాలు ఎట్లు తొలగించబడినాయి?

సిడ్నీ వెబ్,

బియాట్రిస్ వెబ్.

నవంబరు, ౧౯౩౭.

అనువాదకుడు :

మహీధర కృష్ణమోహన్‌రావు.

# మొదటి మాట.

ఒక్క భారతదేశమే కాదు. ప్రపంచం అంతా రష్యాలోని సోవియటువిధానం కేసి ఆతురతతో చూస్తూంది. సోవియటులసిద్ధాంతాలు, కార్యక్రమం, నిర్మాణవిధానమూ, ప్రపంచప్రజలకి—శత్రువులకీ, మిత్రులకీ, కూడా—ఒక మహాసమస్యయై పోయింది. నేడు వారు పొందిన అభివృద్ధికి అవలంబించబడుతూన్న పద్ధతులన్నీ స్వయంగా చూడడానికై అభిమానులూ, అసూయాపరులూ, కూడా సోవియటుయూనియనుకు వెడుతూనే యున్నారు. వారిలో వెబ్ దంపతులు ఒకరు.

వెబ్ దంపతులు సోవియటువిధానంమీద అభిమానం కలవారనియే చెప్పవచ్చు. కమ్యూనిస్టుసిద్ధాంతాల యెడల సంపూర్ణమగు నమ్మకం గల వారుమాత్రం కారు. వారు తాము వ్రాసిన 'సోవియటుకమ్యూనిజం' లో సోవియటువిధానాన్నిగూర్చి ఏదయినా మంచి వ్రాసేరంటే, అది అక్కడి పరిస్థితులకి ముగ్ధులయ్యే వ్రాసేరు. కమ్యూనిస్టులు కానివారిచే సోవియటు ప్రభుత్వపరిస్థితులపై వ్రాయబడి మనకు దొరుకుతూన్న పుస్తకాలలో 'సోవియటు కమ్యూనిజం' ఉత్తమం. ఉదారం.

ఈ మా గ్రంథం ఆ'సోవియటు కమ్యూనిజం'లో ఒకప్రకరణం మాత్రమే. క్రమంగా ఆపుస్తకం అంతా ఈవిధంగానే ఆంధ్రమహాజనులకి అందించాలని మాకోరిక.

ఆంధ్రపాఠకులు ఈమా యుద్యమానికి సంపూర్ణంగా చేయూత నిస్తారనే మానమ్మకం.

1937 నవంబరు.
ముంగండ.

మహీధర కృష్ణమోహన్‌రావు,
సంపాదకుడు.

౧

# జమీందార్లను, పెట్టుబడిదార్లను, తొలగించుట.

౧౯౧౭వ సంవత్సరం ఫిబ్రవరి నెలలో జరిగిన విప్లవంతో రష్యాలోని జారుప్రభుత్వం నాశనమై పోయింది. కాని, సాధారణంగా అంతా అనుకునేటట్లు ఈవిప్లవం బోల్షివిక్కుల ఆధిపత్యాన జరగలేదు. బోల్షివికునాయకుడైన 'లెనిను' విప్లవం పూర్తియై జారుప్రభుత్వం నశించిన తర్వాత ఒక నెలకూ, 'ట్రాట్స్కీ' మూడునెలలకూ, కాని రష్యాకు చేరుకోనే లేదు. జారుప్రభుత్వం నిజానికి అంతక్రితం ౧౨సంవత్సరాలకు పూర్వమే నశించిపోయి ఉండవలసినదే. ౧౯౦౫లో రష్యా—జపాను యుద్ధం జరుగుతూన్న రోజుల్లో అన్నివర్గాల ప్రజలూ జారుప్రభుత్వం ఎడల అసంతృప్తి పొంది విప్లవం ఒకటి లేవతీసేరు. ఆవిప్లవంతోనే

జారుప్రభుత్వం పునాదులకంటా కదిలిపోయింది. * కాని "ప్రజలందరూ సంపూర్ణమైన ఐకమత్యం కలిగి ఏకమైనారనుకోవడం కాని ఒకేఒక ఆదర్శంతో ఏకోన్ముఖంగా విప్లవం నడిపించ బడింది అనుకోవడం కాని, గొప్ప పొరపాటు. ఈ లాగ అనుకోవడం చేతనే తర్వాత జరిగిన ఘటనల కన్నిటికీ కారణాల నూహించలేక దైవికం అనుకున్నారు. ఏవిధానంలో మార్పు కావాలో, అది ఎంతవరకూ మార్చబడాలో తేల్చుకొనడంలో భేదాభిప్రాయాలు చాలా కలిగేయి. కలగడానికి అవకాశమూ వుంది. అప్పుడు జరిగినది ఒక్క విప్లవమే కాదు. కొన్నివిప్లవాలు కలిసి ఏకసమయంలో కొనసాగించబడ్డాయి." మొత్తంమీద రైతులు విప్లవంలో అంతగా పాల్గొనలేదు. కార్మికులలో కూడా చీలికలేర్పడ్డాయి. దీనికితోడు వారిలో పట్టుదలకూడా అంత తీవ్రంగా లేకపోయింది. అయినా ఈ అశాంతిని చూచి భయపడి జారుచక్రవర్తి రాజ్యాంగవిధానంలో కొంత మార్పు తేవడానికి అంగీకరించి "డ్యూమా" అనే ప్రజాప్రతినిధి సభను యేర్పరచి తన అధికారాన్ని రక్షించుకొనగలిగేడు. విప్లవోద్రేకం తగ్గింది. కాని జారుచక్రవర్తి ఇచ్చిన "డ్యూమా" వలన ప్రజల దుస్థితి ఎంతమాత్రము తొలగిపోలేదు. పూర్వపు నిరంకుశపరిపాలనావిధానంలో కొద్దిగాకూడా మార్పు కలగలేదు. నిర్బంధవిధానం పూర్వంకంటేనూ హెచ్చింది. ఇచ్చిన "డ్యూమా" రెండేళ్ళలో నామమాత్రావశేషం అయి

---

* ౧౯౦౫ వ సంవత్సరంలో ఒక సుప్రసిద్ధుడైన చరిత్రకారుడు ఈవిధంగా వ్రాసేడు. "రైతులు-జమీందారులు, కూలీలు-పెట్టుబడిదారులు, మొదలైన ముఖ్యవర్గాలు అన్నీ ఏకో ఒకవిధంగా సామాజిక విధానాన్ని మార్చడానికై తీవ్రప్రయత్నాలు చేసేరు."

"Rural Russia under the old regime"
G. T. Robinson.

పోయింది. నిర్బంధపు పన్నుల్ని ఈయడానికి నిరాకరించి దేశంలో వేర్వేరు ప్రాంతాలలో తిరుగుబాటుచేసినరైతులు అతిక్రూరంగా అణచి వేయబడ్డారు. నానాటికి సంఖ్యాధికు లౌతూ, * విదేశీయులైన పెట్టుబడి దారులచే దోపిడీచేయబడుతూన్న ఫాక్టరీకూలీలకు గల ప్రాథమిక హక్కులు—గనులు మొదలగు వానిలోగల కూలీలు 'ట్రేడ్‌యూని యనుల' నేర్పాటుచేసుకొనడం, హెచ్చుకూలి కోసం సమ్మెచేయడం మొదలైనవి—తొలగించబడినాయి. ౧౯౦౭ లో 'ట్రేడ్ యూనియను' లన్నీ అణచివేయబడినాయి. 'జంస్ట్వోవ్' లనబడే రాష్ట్రీయశాసనసభ లన్నీ బహుక్రూరంగా అణచివేయబడినాయి. ఏవో కొద్ది సంస్కరణాలు కోరినంతమాత్రంచేత జమీందారులుకూడా జారుచక్రవర్తి కోపానికి గురియైనారు. వారిలో ఎందరో దేశాంతరాలకు పంపివేయబడ్డారు. రష్యాలోని జనసంఖ్యలో సగానికిపైగానున్న 'పాలితజాతులు' (Subject Nationalities) పూర్వం కంటేనూ క్రూరంగా అణచివేయబడ్డారు. వారి మాతృభాషలు నిషేధించబడినాయి. ఆభాషలలో వెలువడే పుస్త కాలు, పత్రికలు నిలిపివేయబడినాయి. స్కూళ్ళు మూసివేయబడ్డాయి. ప్రతీపట్టణంలోనూ యూదులకై కొన్నివీధులు ప్రత్యేకించబడి వాటిలోనే నిర్బంధంగా ఉంచివేయబడ్డారు. ఉద్యోగులు వారిని తీవ్రదండనలకు గురిచేసి కొరడాలతో కొడుతూ, అస్పృశ్యులకంటేనూ హీనంగా చూసేవారు. సనాతన గ్రీకుచర్చికి సంబంధించిన విద్యావిహీనులు,

---

* "౧౯౦౫ వ సంవత్సరపు విప్లవానికీ, యూరపు యుద్ధానికీ, మధ్యగల కాలంలో రష్యాలో పారిశ్రామికోత్పత్తి రెట్టింపు అయింది."

History of the Russian Revolution.

—L. Trolsky.

మూఢులునగు మతబోధకులు ఇతరమతాలను అణచిపెట్టి, తద్వారా ప్రజలను మూఢత్వంలో అణచిఉంచేటందుకై సాధనమాత్రంగా ఉపయోగించబడ్డారు. వీటికితోడు 'రాస్పుటీన్' యొక్క రాక్షసకృత్యాలు, జారులకుటుంబంతోటి, ఇతర రాజకుటుంబాలతోటి, 'రాస్పుటీన్' కు గల అవినీతికరమైన సంబంధాలు ప్రజలలో చాలా అసహ్యం కలిగించేయి. ఈకారణాలన్నిటివలన ప్రజలకి జారుప్రభుత్వం మీద తీరని ద్వేషం పెరిగి ఆఖరికి దాని నాశనానికి కారణం అయింది. చరిత్రలో ఎక్కడాకూడా ఇంతచేతగాని ప్రభుత్వాన్ని, క్రూరనిర్బంధవిధానం అవలంబించి ఆఖరికి ఆనిరంకుశత్వం ద్వారా తన గొయ్యి తానే త్రవ్వుకొన్న ఈజారుప్రభుత్వం వంటిదానిని, చూడబోము.

ప్రజలలో నానాటికీ పెరిగిపోతూన్న అశాంతి క్రమంగా విప్లవానికి దారితీస్తుందనే భయంతో, జారుప్రభుత్వాన్ని నడిపిస్తూన్న రాజ్యాంగనీతిజ్ఞులు రష్యాకూడా ప్రపంచయుద్ధంలో పాల్గొన్నట్లయితే తాత్కాలికంగా విప్లవబాధను తొలగించుకోవచ్చునని అపోహపడి, జర్మనీతో యుద్ధానికి దిగి రష్యాసైన్యం సంపూర్ణంగా ధ్వంసం కావడానికి కారకులైనారు. కాని, బోల్షివికునాయకుడైన లెనిను, రష్యాకూడా యుద్ధంలో దిగిందన్న వార్త వినగానే విప్లవం కొద్దికాలంలోనే వచ్చి తీరుతుందని గ్రహించేడు. అదేవిధంగా యుద్ధంలో అడుగుపెట్టిన రెండున్నర సంవత్సరాలకే, ౧౯౧౭ వ సంవత్సరం ఫిబ్రవరి నెలలో లెనిన్ యొక్క ప్రోత్సాహంకాని, సారథ్యంకాని, అవసరం లేకుండానే అశాంతిపొందియున్న ప్రజలు తిరగబడ్డారు. తగిన ఆయుధాలుకాని, ఇతరపరికరాలుకాని, లేక సరియైన నాయకత్వంలేని రష్యనుసైన్యాలు జర్మనులచే ఓడింపబడి, యుద్ధరంగం విడిచి, స్వగ్రామాలకు పారిపోయి రావడంకూడా విప్లవానికి దారితీసింది. ౧౯౧౭ ఏప్రియలు నెలలో

లెనిన్ రష్యా చేరుతున్నాడు. ఆనాటికే బూర్జువాడెమోక్రాటిక్ విప్లవం పూర్తియై. జారుప్రభుత్వం అంతరించి, దానిస్థానే ఇతరములయిన యూరపుఖండదేశాలలోమాదిరిగానే ఉదారప్రజాస్వామికప్రభుత్వం ఏర్ప డింది. ఆ ప్రభుత్వంకూడా ప్రత్యేకఆస్తిహక్కులను రక్షించడమే తన ముఖ్యకర్తవ్యంగా తలచింది. అందుచేత జమీందార్లనూ, పెట్టుబడి దార్లనూ, తొలగించడానికై లెనిన్ సోషలిస్టువిప్లవం తీసుకు రావలసి వచ్చింది.

౨

# జమీందారుల భూమిహక్కును

# తొలగించుట.

జారుప్రభుత్వం కూలిపోయిందనే వార్త దేశం అంతటా వ్యాపించగానే ప్రభుత్వసహాయంగాని, మార్క్సుసిద్ధాంతాల సహాయంగాని, అవసరం లేకుండానే బీదరైతులు జమీందార్ల చేతులలోనుంచి భూములన్నీ స్వాధీనం చేసుకొనడం ప్రారంభించేరు. రష్యాలోని బీదరైతులూ, ధనికులైన రైతులూకూడా, తాము సాగుచేస్తూన్న భూమి తమదేయనీ, *'మిర్' యొక్క నిబంధనలుగాక వేరేవీ తమ్మునిరోధించలేవనీ వాదించసాగేరు. ౧౯౧౭ కు పూర్వం ౨౦ ఏళ్ళనుంచీ కూడా రష్యాలో ఏదో ఒకమూల రైతులు తిరగబడడం జమీందార్లను చంపి, వారి భవనాలను

* " 'మిర్' అన్నది గ్రామసౌకర్యార్థమై రష్యాలో ఏర్పడిన సంస్థ. ఇది గ్రామపంచాయతీ వంటిది. దీనిద్వారా ఎప్పటికప్పుడు గ్రామంలోని భూమినంతనూ కుటుంబాలవారికీగా పంచిపెట్టడానికి ఏర్పాట్లు చేయబడుతూండేవి." —అనువాదకుడు.

కాల్చి, భూముల్ని పంచుకోవడం, అలవాటయింది*. దీనికి ప్రతిక్రియగా ప్రభుత్వం ఎంతోమందిని ఉరితీసీ, 'సైబీరియా'కు, ప్రవాసం పంపించీ, జైళ్ళలోపెట్టీ శిక్షించుతూ వుండేది. కాని, ఎన్నివిధాలశిక్షించినా ఏదో ఒకమూల రైతులు తిరగబడుతూనే వుండేవారు. రష్యాప్రభుత్వం మహా

---

* "౧౯౦౪ తో అంతమైన ౫ సంవత్సరాలలోన, యూరపియన్ రష్యాలో ఇటువంటి తిరుగుబాట్లు వందలకొద్దీ జరిగేయి. కొన్నిటిలో ఆస్తులు నాశనం ఐనాయి. భవనాలు తగులపెట్టబడినాయి. కొన్నిచోట్ల జమీందార్లు చంపబడ్డారు. కాని, ఇవన్నీ తలోకమూలా, ఒకదానికొకటి సంబంధం లేకుండా, అప్పుడప్పుడు జరిగేయి. ౧౯౦౨ లో 'ఖార్కోవు'—'పోల్టావా' ప్రాంతాలలో ప్రతిగ్రామంలోను రైతులు తిరగపడ్డారు. ఇది ఒక చిన్న విప్లవం అనే చెప్పవచ్చు. 'ఖార్కోవు' ప్రాంతపు తిరుగుబాటు ౧౬౦ గ్రామాలకి వ్యాపించింది. ఐదు రోజులలో ఎనభై జమీందారీలు ధ్వంసం చేయబడ్డాయి. ఒక్క 'పోల్టావా' ప్రాంతంలో ౮౫ గురు జమీందార్ల ౨,౫౦,౦౦౦ రూబుళ్ళ ఆస్తి ధ్వంసం చేయబడినదని ప్రభుత్వానికి ఫిర్యాదు చేసేరు."

Rural Russia under the Old regime.
—G. T. Robinson.

"సెరటోవ్ ప్రాంతంలో ౩౦౦ జమీందారీలు లూటీచేయబడ్డాయి. 'బెలాసోవ్ ఉజడ్' వద్ద కొన్నికొన్ని ఎస్టేట్లు సంపూర్ణంగా నాశనం చేయబడ్డాయి. రైతులు వెనకముందుచూడకుండా సమస్తమూ కాల్చేశారు. పైకప్పులు కాలిపోగా మిగిలిన గోడలుకూడా కూలగొట్టేరు. పశువులు, గుఱ్ఱాలు, ధాన్యం, ఇతరసామానులు, అన్నీ దోచేసుకున్నారు. తీసుకొని పోవడానికి వీలులేని వానినన్నిటినీ కాల్చి పారవేశారు."

(పైదానిలోనే p. 175.)

యుద్ధంలో తగుల్కొనియున్న సమయాన, రైతులు తిరుగుబాటుచేసి, జమీందారీలను స్వాధీనం చేసుకొనే ప్రయత్నాలు దేశంలో ఎక్కువమైనాయి. ఫిబ్రవరివిప్లవం, జారుచక్రవర్తియొక్క రాజ్యపరిత్యాగం, దేశంలో తెలియరాగానే రైతులు చెలరేగి విచ్చలవిడిగా జమీందారీలను స్వాధీనం చేసుకొని, పంచుకొనడం ఆరంభించేరు. అప్పటికింకా లెనినును పట్టుకొనడానికై 'కెరన్‌స్కీ' పోలీసులు తీవ్రప్రయత్నాలు చేస్తూనేయున్నారు. ఒక్కఉదాహరణ చెప్తే ఆనాటిపరిస్థితులు ఏలాగ ఉండేవో పూర్తిగా తెలుస్తాయి.

"అది ౧౯౧౭ వ సంవత్సరం సెప్టెంబరు నెల. ఒకరోజు సాయంకాలం దక్షిణసైబీరియాలోని ఒకపచ్చికమైదానం గుండాయున్న ఒక రోడ్డు ప్రక్కన టెలిఫోనుస్తంభం పైకెక్కి ఒకడు, ఉత్తరప్రాంతాలలోని ఒకజమీందారుని యింటిని ఇతరపట్టణాలతోటి, పోలీసుస్టేషనుతోటి, సైనికనివేశాల తోటి, కలిపే తీగను తెంపివేశాడు. దానితో ఆ జమీందారునికి ఇతరప్రదేశాలతో గల సంబంధం ప్రపంచంతోగలసంబంధం తెగిపోయినవి. సహాయం వస్తుందనే ఆశకూడా అంతరించింది. వెంటనే అచ్చటి రైతులు తిరుగుబాటుచేసి, ఆజమీందారుని సకుటుంబంగా హత్యచేసి, భవనం తగులబెట్టి, ఆస్తి దోచుకొని భూమి పంచుకున్నారు."*

---

* Rural Russia under the old Regime.
— G. T. Robinson.

1917-18 సంవత్సరాలలో రైతులు తిరగబడి చాలమంది జమీందార్లని చంపేశారు. సమయానికి అక్కడ లేకపోవడం చేతనో పారిపోవడం చేతనో ప్రాణాలు దక్కించుకొని, బయటపడిన, జమీందారులు కుటుంబాల్ని వెంటపెట్టుకొని విదేశాలకు పారిపోయేరు.

ఈవిధంగా అక్టోబరునెలలో బోల్షివిక్కులు అధికారంలోనికి వచ్చేటప్పటికే దేశం అంతటా జమీందార్లను లాగివేసి, వారి భూముల్ని రైతులు పంచేసుకున్నారు. ౧౯౧౮ వ సంవత్సరంలో అక్కడా అక్కడా మిగిలిన జమీందార్లు, సంపూర్ణంగా తమహక్కులనుంచి తొలగించబడ్డారు. లెనిన్‌గాని, ఆతని అనుచరులైన ఇతరబోల్షివిక్కులుగాని "ఈలాగ చేయాలి" అని చెప్పనక్కరలేకుండానే రైతులే జమీందార్లనందరినీ పూర్తిగా తొలగించివేశారు. జమీందారుల ఆస్తుల్నీ, భూముల్నీ, లాగుకోవడంలో తప్పు లేకపోవచ్చును. కాని, ఆపని చేయడంలో అవలంబించబడిన విధానం మాత్రం బహుక్రూరమైనది. జమీందార్ల ఆస్తుల్ని నాశనం చేయడంచేత మొత్తంమీద దేశానికి చాలా నష్టం కలిగింది. పెద్ద పెద్ద కమతాలను విడదీసి, కోటీ, ఎనభై లక్షలమందిజనం—రైతులు వారి సహచరులైన కూలీలు—పంచుకొనడంచేత ఆహారపదార్థాలు—ముడిసరుకులు ఉత్పత్తి తగ్గిపోయింది. బజారుకి అమ్మకానికి వచ్చే సరుకుయొక్క పరిమాణం, రకమూ కూడా బాగా తగ్గిపోయింది. అందుచేత పట్టణాలలోని ప్రజలకి ఆహారపదార్థాలు కరవైనాయి. అప్పుడు చేయవలసిందేమిటి? ౧౯౧౭—౧౮ సంవత్సరాలలో రష్యాదేశం ఉన్నస్థితిలో యుద్ధరంగంనుంచి లక్షలకొలదీ సైనికులు సాయుధులై జమీందార్లభూముల్ని పంచుకొనడానికై పల్లెటూళ్ళకి ఎగబడుతూన్న సమయాన ఏప్రభుత్వం ఈవిధానాన్ని ఆపగలదు? అప్పుడప్పుడే రాజ్యాధికారంలోనికి వచ్చిన బోల్షివిక్కుప్రభుత్వంకూడా ఈవిషయంలో ఏమీ చేయలేకపోయింది. పెద్ద కమతాల్ని రైతులు పంచుకోకూడదనే అసమ్మతిని ప్రకటించినా అదంతా నిరుపయోగం అయివుండేది. ప్రజలు బోల్షివికుప్రభుత్వంమీద కూడా తిరగబడియుండేవారు. అందుచేతనే లెనిను సమయానుకూలంగా "కాంగ్రెసు" "సోవనార్కుము" లచేత "ఈభూమి యంతా ప్రజలదనీ,

అందుచేత జార్ నికోలసుయొక్క, రాజబంధువులు, జమీందారులు, మతాధికారులు, మొదలైనవారియొక్క స్వాధీనంలోయున్న భూములన్నిటినీ రైతులు తమచేత ఎన్నుకోబడిన గ్రామసంఘాలద్వారా పంపకం చేసుకోవలసిం"దనీ, ప్రకటింప చేశాడు. కాని, వెనుకటి భూస్వాములయొక్క స్వంతసేరీలుగా ఉండి పశువృద్ధికి, నూతనపద్ధతుల్ని కనిపెట్టడానికీ, ఉపయోగింపబడుతూండే భూములుమాత్రం "ఆదర్శకృషిక్షేత్రాలు"గా ఉపయోగించబడుతూ, జాతీయప్రభుత్వంయొక్క అధికారంలోనే వుండాలనే నియమం చేయబడింది. కాని, చాలచోట్ల ఈ "ఆదర్శకృషిక్షేత్రాల"ను కూడా రైతులు స్వాధీనం చేసుకొని పంచుకున్నారు. ఈవిధంగా కొద్దిమంది అధికారంలోనున్న రష్యాలోని భూమి అంతా రెండుకోట్ల ఏభైలక్షల రైతుకుటుంబాలకి స్వాధీనం అయిపోయింది. బోల్షివిక్కులు అధికారంలోకివచ్చిన పదిఏండ్లకి కాని ఆభూమిని రైతులనుంచి తిరిగి స్వాధీనం చేసుకొని జాతీయంగా చేయలేకపోయేరు.

# 3

# పెట్టుబడిదారీవర్గాన్ని తొలగించుట.

రష్యాలో పెట్టుబడిదారీవర్గాన్ని నిర్మూలించడం పూర్తిగా బోల్షివికుప్రభుత్వం వలననే జరిగింది. మార్క్సుసిద్ధాంతాల్ని నమ్మేవారు ప్రస్తుతపు నాగరిక ప్రపంచములోని చెడుగులన్నిటికీ "లాభము—వడ్డీ—అద్దె" ద్వారా ప్రజల్ని దోచుకుంటూన్న వర్తకులు, వడ్డీవ్యాపారులు, పరిశ్రమల యజమానులు, ఓడలు—మేడలుగల పెట్టుబడిదారులే కారణం అని నమ్ముతారు. ప్రతిదేశములోని ప్రజలు, ధనికులు— దరిద్రులు అనేరెండువర్గములుగా ఏర్పడడానికి కారణం ఈపెట్టుబడిదారులే. అందుచేతనే ఈవర్గభేదం అంతరింపచేస్తూ "ఉత్పత్తి-పంపకం-మారక"ములను సాగించే సాధనాలను ఏవిధమైన ప్రతిఫలం ఈయకుండానే ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలి. "రష్యను సోషల్‌డెమాక్రటిక్‌పార్టీ"లోని అన్నిసంఘాలకీ ఆదర్శం ఇదే. కొద్దిమంది ధనికులయొక్క నిరంకుశపరిపాలనను నిర్మూలించి శ్రామికవర్గనియంతృత్వాన్ని స్థాపించడమే ఆదర్శంగాగల

విప్లవం మినహాగా మరియే విధానమూ కూడ పెట్టుబడిదారీవర్గాన్ని నిర్మూలించలేదు. ప్రపంచంలోని అన్నిదేశాలలోనుకూడ అటువంటి విప్లవాలు రావాలంటే తమ రెక్కల ఆధారం మీదనే కష్టించి జీవించే శ్రామికవర్గం అన్నివిధాలా అభివృద్ధి పొందాలి. ఈకారణంచేతనే శ్రామికవర్గము, పెట్టుబడిదారీవిధానము, బాగావృద్ధిపొందని రష్యాలో ఇటువంటి సోషలిస్టువిప్లవం రావడానికి అవకాశాలు లేవని దూరదృష్టిలేని కొందరు మార్క్సిస్టులు చెపుతూండేవారు. లెనినుకు పూర్వంవున్న మార్క్సిస్టులు, ఇంగ్లండు—ఫ్రాన్సు—స్కాండినేవియా—మొదలైన ప్రజాస్వామికదేశాలలోకాని; సామర్థ్యము, ప్రజానుకూలమైన ఉద్యోగీయవర్గము, అభివృద్ధి చెందిన సాంఘికసేవాసంస్థలు, బలవత్తరమైన సోషల్ డెమక్రటిక్ పార్టీ, శాసనానుకూలము—సుశిక్షితమునగు 'ట్రేడు—యూనియన్లు,' కోఆపరేటివు ఉద్యమాలుగల జర్మనీదేశంలో గాని—; లేని గొప్పవిప్లవానుకూలస్థితి రష్యాలో వున్నదని గ్రహించలేకపోయారు. విప్లవానుకూలస్థితి అంటే? కారాగృహాలలో, సైబీరియాలో, శిక్షలననుభవిస్తూ, ప్రాణాలకికూడా తెగించి విప్లవకారకములైన సమ్మెల్ని నడిపించే కార్మికనాయకులు; రైతులయొక్క తిరుగుబాట్లను నడిపించే రైతునాయకులు; వ్యక్తిహింసా పద్ధతులపై జారుప్రభుత్వాన్ని కూలదోయ్రియతలచే విద్యార్థికులు; బీదతనం చేత—ప్రభుత్వనిర్బంధాలచేత దుర్భరములైన జీవితాల్ని గడుపుతూన్న ప్రజాసామాన్యము; వారేమిటి? వీరేమిటి? ప్రజలలోని అన్నివర్గాలవారు వివిధంగానైనాసరే జారుప్రభుత్వాన్ని కూకటివేళ్ళతో పెల్లగించిపారవేయాలనే దారుణకోపం కలవారే. రష్యాలో ఈవర్గాలకున్నంత స్పర్థ, క్రోధము, ఇతరదేశాలలో లేదని గుర్తించక పోవుటచేతనే లెనిన్ప్రముఖులు పారిశ్రామికముగా అభివృద్ధిచెందిన ఇంగ్లండు, జర్మనీ, మొదలయిన దేశాలలోనే శ్రామికవర్గవిప్లవాలు ముందుగా బయలుదేరుతాయన్ని

భావించేరు.* కమ్యూనిజంయొక్క విశాలతత్త్వంలోను, దానియొక్క ఆచరణాశ్యతయందును, వారికి సంపూర్ణమైన విశ్వాసం వుంది. దానికి తోడు రష్యాఒక్కచోటనే కమ్యూనిష్టుపరిపాలనను పూర్తిగాను, స్థిరం గాను, స్థాపించడం అసంభవం అనికూడా వారు ఎరుగుదురు. ఉత్పత్తి సాధనాలను సమాజపరంచేయడం; నేడు కార్యాసక్తికి కారణభూతముగా యున్న లాభదృష్టిని తొలగించి దానిస్థానే, సమాజసేవాసక్తిని కలిగిం

* ఇది గ్రంథకర్త యొక్క అనాలోచితముగా వ్రాయబడిన వాక్యం. లెనినేకాదు, ఏకమ్యునిస్టూ ఆలాగ చెప్పలేదు.

"అంతర్జాతీయకార్మికవర్గం నేడే ముందుకు రాలేదు. కాని, ఏదో ఒకనాడు వచ్చితీరుతుంది."

—లెనిను.

"ఇతరదేశాల కార్మికుల నెదుర్కొన్న ముఖ్యకర్తవ్యాలకన్న విప్లవ కరము, అత్యవసరము, నైన కర్తవ్యాన్ని చరిత్ర మనచేతికి ఒప్పచెప్పింది. ఒక్క యూరపులోనే కాదు. ఆసియాలోకూడా విప్లవవిరోధ శక్తుల దృఢతరవ్యూహాన్ని ధ్వంసం చేయడమే ఆకర్తవ్యం. దీనికై ఆ కర్తవ్యం మనరష్యను కార్మివర్గాన్ని అంతర్జాతీయ విప్లవకరశ్రామికవర్గాల అగ్రభాగాన నిలువపెట్టింది."

( —లెనిను. What to do? ప్ర. 1. )

"అంతర్జాతీయ సామ్యవాదవిప్లవనాయకత్వం రష్యనుకార్మికవర్గం చేతులలోకి జారిపోతూంది.

కారల్ కాట్స్కీ.

గ్రంథకర్తయొక్క మాట పొరపాటు అని చెప్పడానికింతకంటె వేరే అవసరంలేదు.

—అనువాదకుడు.

చడం; వీటిద్వారానూతనసమాజాన్ని స్థాపించగలమనీ, కమ్యూనిజం యొక్క నైతికతత్త్వమునెడల అకుంఠితవిశ్వాసం కలిగియుండడం: కారణంగా తాము అవలంబించిన విప్లవకార్యక్రమం వ్యక్తులకు బాధ కరంగా ఉంటూన్నప్పటికీ ఏమాత్రమూ లక్ష్యం చేయకుండా దృఢదీక్షతో వారు యంత్రములవలె పనిచేశారు. కెరన్‌స్కీ యొక్క తాత్కాలికమగు ఉదారప్రజాస్వామికప్రభుత్వాన్ని ఏవిధంగానైనా నిలువబెట్టడానికి ప్రయత్నించే పెట్టుబడిదారీవర్గపు నియంతృత్వాన్ని కూలద్రోయడానికై లెనిను ఎంత సాహసమైనా చేశాడు. ఎంత రక్తపాతానికైనా వెనుదీయలేదు. ఎన్నోరోజులవరకూ మాస్కోలో పోరాటాలు జరుగుతూన్నప్పటికీ, 'లెనిన్‌గ్రాడ్' మొదలైనచోట్ల ఎన్ని హత్యలు జరిగినా, మొత్తంమీద అక్టోబరువిప్లవం ప్రజాభిప్రాయసమ్మతమే నని చెప్పితీరాలి. తరువాతకూడా సోవియటుప్రభుత్వాధికారాన్ని నిలువపెట్టడానికీ విప్లవవ్యతిరేకుల తిరుగుబాట్లనణచివేయడానికీ, లెనిన్ యొక్క సహచరులు క్రూరత్వం అవలంబించకతప్పిందికాదు. రాజకీయసిద్ధాంతాలలో తమతో కలియనివారిని నిర్బంధించేరు. ఏదో విచారణ జరిగించేమనిపించి శిక్షలు విధించేరు. దొంగల్నీ, ముచ్చుల్నీ, చూసినట్లే చూసేరు. గూఢచారిదళాన్ని స్వేచ్ఛగా ఉసికొల్పేరు. ఒకటేమిటి? అంతర్యుద్ధాలలో ఆచరణలోనికివచ్చే దారుణాలన్నీ జరిగేయి. ప్రపంచంలోని ఇతరప్రభుత్వాలన్నీకూడా పెట్టుబడిదారీ విధానాన్నే సమర్థించుతూ వుండడంచేత అవన్నీ సోవియటుప్రభుత్వం యొక్క క్రోధానికి గురియైనాయి. లాభాలను సంపాదించాలనే అభిప్రాయం కప్పిపుచ్చడానికి ఎన్నిఅబద్ధాలు పైకి ఆడుతూవున్నా ఆప్రభుత్వాల అభిప్రాయం అదియేకాదు? ఇతరప్రభుత్వాలయెడ సోవియటులకుగల ద్వేషానికి ఫలితంగా, జారునికోలసుతో సంబంధబాంధవ్యాలుగల ప్రభుత్వాలు సోవియట్లపై యుద్ధానికి దిగేరు. వెంటనే అయిదారు విదేశీప్రభు

త్వాలు ఏకమై సోవియట్లపై తమసేనల్ని పంపించి వారిని తరమడం ఆరంభించేరు. సోవియటుప్రభుత్వం తనయావచ్ఛక్తినీ వినియోగించి ఆత్మరక్షణం చేసుకోవలసివచ్చింది. అనేకయితరరాజకీయకారణాలచేత తూర్పుభాగంలోకూడా జర్మనులమీద దండయాత్ర సాగించేరు. ౧౯౧౯—౨౦ లనాటికి ఈపోరు తీవ్రం అయింది. విదేశీయులు బోల్షివిక్కులమీద యుద్ధం ప్రకటించినది, రష్యనుజమీందార్లమీద—పెట్టుబడిదార్లమీద గల ప్రేమచేత గాదు. ఈబోల్షివిక్కులు తమదేశంలోకూడా విప్లవం లేవదీస్తారేమోననే భయంచేతనే, ఈయుద్ధం సాగించబడింది. 'ప్రపంచవిప్లవం రాకతీర'దని బోల్షివిక్కుల అభిప్రాయంలో కొంతనిజం లేకపోలేదు.

బోల్షివికువిప్లవపు మొదటిరోజుల్లో జరిగిన దారుణసంఘటనాలను వివరంగా తెలుసుకోవడం మనకి సాధ్యంకాదు. "౧౯౧౭ వ సంవత్సరం ఆఖరున రష్యాసామాజికవిధానంలో కలిగినంత మార్పు ప్రపంచంలో మరెప్పుడూ ఎక్కడా జరిగియుండలేదు. దేశంలో శాంతి స్థాపిస్తామని ప్రగల్భాలు కొట్టిన 'కెరన్‌స్కీ' ప్రభుత్వం శాంతి నెలకొల్పలేకపోయింది. బ్రిటిషుసేనలు వెనుకవైపునుంచి జర్మనుసేనలమీద ఒత్తిడి తేలేకపోవడంచేత 'జారు' సైన్యాలు సంపూర్ణంగా ఓడిపోయినాయి. వారిలో ఒకకట్టుబాటుగాని, ఆయుధాలుగాని, ఆహారపదార్థాలుగాని, లేక చెల్లాచెదరై దేశంమీదికి ఎగబడ్డారు. ఆదుస్థితి సంపూర్ణంగా అరాజకమైపోయిన సామాజికస్థితికి నిదర్శనం. సామాజికవ్యవస్థ సంపూర్ణంగా విడివడిపోయింది." అంటూ H. G. Wells వ్రాసేడు.

ఇట్టిపరిస్థితుల్లో బోల్షివిక్‌విప్లవము మెరపుతీగలావచ్చి ప్రపంచాన్ని దిగ్భ్రమనొందించింది.

౪

# అంతర్యుద్ధం: విదేశీయుల దాడి.

౧౯౧౭ వ సంవత్సరం ఆఖరుకు ఇంకా బోల్షివికుప్రభుత్వం రష్యాదేశంలో పాదుకోలేదు. పెట్రోగ్రాడ్, మాస్కోనగరాలలో కూడా ప్రజల ధనమానప్రాణాలకు తగిన రక్షణము లేదు. నడివీధులలో హత్యలు జరుగుతూ వుండేవి. దొంగతనాలు ఎక్కువ య్యైనాయి. ప్రభుత్వోద్యోగుల వేషంతో ఇళ్ళలో దూరి, దోపిడీ చేయడం సర్వసాధారణం అయిపోయింది. పట్టణాల వెలపల ప్రజలకి రక్షణ యేమాత్రం లేదు. ఇంగ్లండు, ఫ్రాన్సు, మొదలైన దేశాలు రష్యాకు పంపబడే ఎగుమతుల్ని నిషేధించడం చేత, అక్కడ తిండి, బట్ట, మందు, కూడ కరవయింది. దేశం అంతటా విప్లవప్రతికూలురు పెచ్చుపెరిగి ప్రభుత్వోద్యోగుల్ని హత్యచేసి తిరుగుబాట్లు సాగించేరు. ఈపరిస్థితులలో ఇంగ్లాండు—ఫ్రాన్సు—ఇటలీ—జపాను—అమెరికా సంయుక్తరాష్ట్రాలు—మొదలయినవి ఏవిధమైన యుద్ధప్రకటన చేయకుండానే 'ఆర్కేంజిలు' 'వ్లాడివాస్టకు' 'యూక్రెయిన్' 'క్రాన్‌స్డాట్' 'మర్మాన్‌స్కు' మొదలైనప్రాంతాలనుంచి దండయాత్ర లారంభం అయినాయి. ఈదేశాలన్నీ బోల్షివికులపై తిరగ

బడి సైన్యాలు సమకూర్చుకుంటూవున్న డెనైకిన్—కోల్చాక్—జుడేనిచ్—రాంగెల్—మొదలయినవారికి ఆయుధాల్నీ, సైనికోద్యోగుల్నీ, ఇంకా ఇతరసహాయాల్నీ చేసి, బోల్షివికుప్రభుత్వాన్ని కూలదోయడానికి శక్తి, కొలదీ ప్రయత్నించేయి. జర్మనులు, పోలులు, యూరపురష్యాలోని పశ్చిమభాగాన్నంతనీ దోచుకొని, ధ్వంసం, చేయసాగేరు. జారుప్రభుత్వ కాలంలో ఖైదీలుగాపట్టుకొనబడి యూరపుయుద్ధంలో జర్మనులకెదురుగా పోరాడుతూవున్న జెకోస్లావేకియనుఖైదీలు బోల్షివిక్కులను ప్రతిఘటించి సైబీరియారైలుమార్గాన్నంతనీ ఆక్రమించుకున్నారు. జార్జియా, యూక్రెయిన్ రాష్ట్రాలలో విదేశీయుల సహాయంతో విప్లవప్రతికూలురచేత ప్రభుత్వాలు స్థాపించబడినాయి. కాని, ప్రజలు వారికి లొంగక తిరుగుబాటు చేశారు. ఈతిరుగుబాటులను అణచివేయడానికి విదేశీయసైన్యాలుకూడా సహాయం చేసేయి.*

---

* "ఈవిధంగా విదేశీయులు కూడా, దేశీయులతో కలిసి చేసిన ఘోరాలు ఎన్నోవున్నాయి. 'బాకూ' నగరంలోని ౨౬గురు 'కమిసారుల'ను చంపడం ఈఘోరాలలో ఒకటి. వీరందరు చంపబడిన ౧౯౧౮ సెప్టెంబరు౨౦ వ తేదీ, రష్యనుఅంతర్యుద్ధచరిత్రలో ఒకదుర్దినంగా పరిగణించబడుతూంది. రష్యాప్రజలు వారి స్మారకార్థం ౧౯-33 వ సంవత్సరం సెప్టెంబరు ౨౦ వ తేదీన ౧౫ వ స్మారకదినాన్ని మహావైభవంగా జరిపించేరు. బోల్షివికులకు ప్రత్తి పండే పరగణాలు లేకుండా చేయడానికీ, మధ్యఏషియాలోకూడా తమ సామ్రాజ్యాన్ని వ్యాపింపచేయడానికీ, బ్రిటిషుసైన్యాలు పర్షియాద్వారా తురుష్కస్థానం మీద దండెత్తి "మెన్షవికు"లయొక్క "సోషలురివొల్యూషనరీ"లయొక్క సహాయంతో "బాకూ" ఆక్రమించుకున్నారు. ఆనాడు పట్టుబడిన ౨౬గురు బోల్షివికుకమిసారులను అర్ధరాత్రివేళ జైలునుంచి లాగుకొనిపోయి కాల్చి చంపివేశారు."

—Moscow daily News. 20 Sep. 1933,

ఈవిధంగా నేడు U. S. S. R. అని పిలువబడే ప్రదేశం అంతా ఇంచుమించు మూడేళ్ళపాటు అంతర్యుద్ధంలో మునిగిపోయింది. తిరుగుబాట్లు విదేశీయుల దాడులు మొదలయినవాటితో అరాజకం ప్రబలిపోయింది. అప్పుడు దేశంలోని పరిస్థితులు ఏలాగవున్నాయో తెలుసుకోవాలంటే మహాతీవ్రవాది, అరాచ్వాది, బోల్షివికువిరోధి మైన "అలెగ్జాండరుబెర్క్మన్" యూనియన్‌రష్యా అంతా సంచారంచేసి వ్రాసిన విషయంచూడాలి.

"దక్షిణరష్యా అంతటా అరాజకం ప్రబలిపోయింది. ఏప్రభుత్వమూ, స్థిరంగా నిలవబడలేకపోయింది. అంతర్యుద్ధం, పరస్పర వినాశం కారణంగా ఇతరప్రాంతాలప్రజలకంటె ఇచ్చటిప్రజలు శారీరకంగాను, మానసికంగాను, ఏదో మార్పును పొందేరు. ప్రజలు నిరంతరం ప్రాణాలు అరచేత పట్టుకొని తిండిలేక మలమల మాడుతుతున్నారు. యూక్రెయిన్‌లో ౧౯౧౭—౨౦ ల మధ్య రాజ్యాధికారం ౧౪ మార్లు ఒకరిచేతులలోనుంచి మరొకరిచేతుల్లోకి మారి, ఆప్రాంతం అంతా రుద్రభూమియైపోయింది.........బ్రెస్టు—లిటోవిస్కుసంధి జరిగేటంతవరకు కెరన్స్కీప్రభుత్వానికికూడా లొంగకుండా జాతీయసైన్యాలసహాయంతో 'రాడా' అనునాతడు యూక్రెయిను పరిపాలించేడు. బ్రెస్టు సంధి జరిగినతర్వాతకూడా "హెర్మన్—స్కోరోపాడ్‌స్కీ" అనునాతడు జర్మనుల సహాయంతో 'రాడా'ను ఓడించి ప్రజలపేరిట ఆక్రమించేడు. కాని, జర్మనులు మహాయుద్ధంలో ఓడిపోయి స్వదేశంలోనే విప్లవం రావడంచేత యూక్రెయిన్‌ను వదలివేయవలసివచ్చింది. వెంటనే 'పెట్లూరా' అనునాతడు దేశాన్ని ఆక్రమించేడు. వెంటనే రైతులు తిరుగుబాటుచేసి, బోల్షివికుసైన్యాల సహాయంతో 'పెట్లూరా'ను తరిమివేశారు, ఈబోల్షివికులను 'డెనైకిన్' తరిమివేశాడు. కాని, మరలకొద్దిరోజుల్లోనే

'డెనైకిన్'ను ఓడించి బోల్షివికులు యూక్రెయిను నాక్రమించేరు. ఇది జరిగిన కొద్దికాలానికే 'పోలులు' దండెత్తివచ్చి బోల్షివికుల నోడించి యూక్రెయిను నాక్రమించేరు. వాళ్ళని ఓడించి బోల్షివికులు మరల దానిని వశపరచుకొన్నారు. ఈవిధంగా నిరంతరయుద్ధాలవలన ప్రభుత్వాలలోకలిగే మార్పులవలన సామాన్యప్రజాజీవితము అల్లకల్లోలం అయిపోయింది. సమాజంలోని తరగతులు, కట్టుబాట్లు, ఆచారవ్యవహారాలు నాశనం అయిపోయినాయి. సాంఘికనిబంధనలు సన్నగిలినాయి. నూతనవిజ్ఞానం పట్టుబడకుండానే పూర్వవిజ్ఞానం నశించిపోయింది. దేశపరిస్థితులు నిరంతరం మారిపోతూ వుండడంచేత ప్రజలలో శారీరకంగానూ, మానసికంగానూ, కూడ అస్థిరత్వం ఏర్పడింది. నిరంతరం మారుతూ వుండడంచేత ప్రజలు పరిస్థితుల కనుగుణ్యంగా నడవడం నేర్చుకోలేకపోయేరు. తిండి కూడా దొరకక ప్రజలు మలమల మాడిపోయేరు. ఎవ్వరేమి మాటలాడుకున్నా యుద్ధాన్ని గురించీ, దుర్భరపరిస్థితుల్ని గురించీ మాత్రమే. విప్లవప్రతికూలురు 'Whites' అనే పేరుతోటి, రైతులు 'Greens' లేక 'Pograin' అనేపేరులతోటి తమకు వ్యతిరేకులని తోచినవారినందరినీ నాశనం చేస్తూ, దోచుకుంటూ, అల్లకల్లోలం చేస్తున్నారన్న వార్తలే ఎక్కడ విన్నా. 'మాఖానో'—'మొరూషియా'—'స్థాస్'— మొదలయినవారు చేసిన దారుణకృత్యాలను ప్రజలు కథలుగా చెప్పుకుంటున్నారు. ఇన్ని ఎందుకు? దేశం అంతా నిరంతరం శత్రుభయంతో, అంతర్యుద్ధాలతో సైనిక నివేశనస్థానంలాగ వుండేది. ఒకరినొకరు చంపుకొనడం; ఆస్తులు దోచుకొనడం; కరువులు; సర్వసాధారణం అయినాయి. పరిశ్రమలు నిలిచిపోయినాయి. దేశము ఆర్థికముగా అధోగతిపాలయింది దేశమును స్వాధీనం చేసుకొన్న ప్రతిపక్షము పూర్వపునాణెములను రద్దుచేసి,

కొత్తనాణెముల ముద్రించడం ఆరంభించేరు. కాని, ప్రజలలోమాత్రం జార్—కెరన్స్కీ—యూక్రేనియను—సోవియటు—ప్రభుత్వాల నాణెములన్నీ చెలామణీ అవుతున్నాయి. ఆనాణెములవిలువ ఎప్పుడూ మారుతూ వుండేది. ఆదిమమానవులలోని క్రూరత్వం తిరిగి ప్రజలలో తలయెత్తింది. నీతి—నియమాలు నశించేయి. నాగరికత అనే ఆచ్ఛాదన తొలగించబడింది. ఆత్మరక్షణ అనే మాట ఒక్కటే ప్రధాన సమస్య అయిపోయింది. Whites దేశం స్వాధీనం చేసుకొన్నప్పుడు కమ్యూనిష్టులను చంపేవారు. కమ్యూనిష్టులయెడ సానుభూతికలవారిని, యూదులను, బహు క్రూరంగా హింసించేవారు. ఈ Whites ను ఓడించి బోల్షివికులు అధికారానికి వచ్చినపుడు విప్లవవ్యతిరేకుల్ని హింసించేవారు. అందుచేత ఎవరు అధికారంలోకి వచ్చినా ప్రజలనే బాధించేవారు. దేశం ఒకరినుండి మరియొకరి స్వాధీనంలోనికి వస్తూ పోతూవుండడంచేత ఇటువంటి దుర్మార్గాలు నిరంతరం జరుగుతూవుండేవి. ఈవిధంగా మృత్యుదేవత మూడుసంవత్సరాలవరకు రష్యాలో విలయతాండవం చేసింది."

దేశపరిస్థితులు ఈవిధంగా ఉండడంచేత వ్యవసాయము, పరిశ్రమలు, కూడ పూర్తిగా నశించేయి. ఇప్పుడు U. S. S. R. అని పిలువబడుతూన్న ప్రదేశంలో ౧౯౧౩ లో ఉత్పత్తిఅయిన పదార్థాలలో మూడవవంతుమాత్రమే ౧౯౨౦ లో పండినాయి. ౧౯౧౮—౨౦ ల మధ్య పెట్రోగ్రాడ్ ప్రజలు అనేకమార్లు ఆహారపదార్థాలులేక, బొగ్గు మొదలైనవిలేక మలమల మాడిపోవలసివచ్చింది. ఒక్క పెట్రోగ్రాడ్ లోని ప్రజలేకాదు. దేశంలోని ప్రజలంతా కూడా తిండి—బట్టకూడ లేక బాధపడవలసివచ్చింది. విప్లవశత్రువులను పారద్రోలడానికి పదునాలుగు వేరువేరు రంగాలలో పోరాడుతూవున్న సైనికులకొరకై ఆహారసామగ్రి సమకూర్చడంలోనే బోల్షివిక్కులు తమ శక్తినంతను పూర్తిగా వినియో

గించ వలసివచ్చింది.

'బ్లాంక్వీ' మొదలైన అరాడ్వాదులవలె స్థాపించబడిన ప్రతిప్రభు త్వాన్నీ తిరగదోయడానికే ఎప్పుడూ ప్రయత్నించడం తెలివితక్కువ పని. అంతేకాదు. "ఒకమాటు విప్లవం ప్రారంభిస్తే, తరువాత దానిని ఎన్నికష్టాలు వచ్చినా సరే, కొనసాగించవలసిందే;" నని లెనిన్ చెప్పేడు. ఈరహస్యాన్ని గ్రహించలేకపోవడం చేతనే ౧౮౪౮ వ సంవత్సరం నాటి విప్లవకారులు ఆవిప్లవాన్ని జయప్రదంగా నడిపించలేకపోయారు. విప్లవం ఒకమాటు జయంపొందినదంటే, దానిని విప్లవవ్యతిరేకుల వారినుండి సంరక్షించుటకు ఎంతో త్యాగం చేయవలసియుంటుంది. సోవి యటు గవర్నమెంటు ఏర్పడిన మొదటి మూడుఏండ్లలోను అదిచేయ గలిగినపని యేమిటనే ప్రశ్న రావచ్చును. అది చేయగలిగిన పని విప్ల వాన్ని నిలువబెట్టడమే. ఒక మూల ప్రజలా నిస్సహాయులు. ప్రపంచము లోని దేశాలన్నీ అసూయా—ద్వేషాలతో మునిగియున్నాయి. ఈపరి స్థితులలో ఆప్రభుత్వాలను ఎదురుకొని సోవియటుప్రభుత్వం నిలువబడ గలిగిందంటే అదేమీ చిన్నవిషయం కాదు.

# ౫

# "వార్ కమ్యూనిజం"

## (War—Communism.)

౧౯౧౮—౨౦ సంవత్సరాలమధ్య ధనవంతులతోటీ—విదేశప్రభుత్వాలతోటీ పోరాడుతూ, తమప్రభుత్వాన్ని స్థిరపరచుకుందుకు బోల్షివికులు ప్రయత్నించేరు. ఈకాలంలో అవలంబించబడిన విధానాన్నే "వార్—కమ్యూనిజం" అంటారు. ఈ మూడేండ్లూ రష్యనులంతాకూడా తమ ప్రాణాలు నిలుపుకొనేటందుకైనా తగిన తిండిలేక దుర్భరపరిస్థితులలో కాలం గడిపేరు. ఆరోజులలో తమ పిదికి దాడివెడలివచ్చిన విదేశ సైన్యాల్ని ఓడించడానికి, దేశంలోని విప్లవప్రతికూలుర నోడించడానికి, తమ యావచ్ఛక్తిని వినియోగించేరు. దేశంలోని ఫాక్టరీలన్నిటిలోను తయారైన సరుకునంతను ట్రాట్స్కీ—స్టాలిన్—ఫ్రూంజీమొదలగు సేనాధిపతుల నాయకత్వాన దేశం నాలుగుమూలలా ౧౬యుద్ధరంగాలలో విద్రోహులతో పోరాడుతూన్న ఐదులక్షలమంది సైనికులకోసం ప్రత్యేకించేరు. ట్రాట్స్కీ Armoured Train లోకెక్కి తిండికూడా దానిలోనేతింటూ, అడుగుక్రిందపెట్టకుండా, ఒక యుద్ధరంగం లోంచి మరొక

రంగానికి విధీవిరామంలేకుండా నిరంతరం తిరుగుచూ, సైన్యాల్ని నడిపించేవాడు. అటువంటి కలహాల రోజులలో రష్యను లెంత పట్టుదలతో యుద్ధం చేశారో ఈవిషయం వలననే బోధపడుతూంది. ట్రేడు-యూనియనులు యుద్ధరంగాలలోనికి సైన్యాలను సమకూర్చే ఏజన్సీలుగా ఏర్పడినాయి. విదేశీయులవారినుండీ, విప్లవప్రతికూలురవారినుండీ, తమ్ము రక్షించినందుకు ప్రతిఫలరూపంగా రైతులు ఆహారపదార్థాలను, ఇతరముడి సరుకులను, బోల్షివికుప్రభుత్వం చేతులలో పెట్టేరు. పట్టణవాసులకు నియమితమైన ఆహారము నిచ్చి, సైనికులకు మాత్రం వారికి కావలసిన పదార్థాల నన్నిటిని, సాధ్యమైనంతవరకు సప్లై చేస్తూండేవారు. లెనిను—అతనిసహచరులు చేసిన ఏఆజ్ఞ యైనా తత్క్షణమే కార్యరూపం ధరించవలసినదే. ఎవ్వడయినాసరే విప్లప్రతికూలురతో కలిసి బోల్షివికు ప్రభుత్వానికి వ్యతిరేకంగా కుట్రచేస్తూన్నట్లు అనుమానం తగిలితే చాలు, వెంటనే వారిని నిర్దాక్షిణ్యంగా శిక్షించేవారు. బోల్షివిక్కులు విప్లవవ్యతిరేకుల ఎడల ఎంత నిర్దాక్షిణ్యంగా వున్నా, ప్రజలుమాత్రం బోల్షివికుల యెడల విపరీతమైన అభిమానం కలిగియుండేవారు. రైతులుకూడా బోల్షివికులమీదకంటె Whites మీద ఎక్కువ అసహ్యం చూపించేవారు. కూలీలు అధికోత్సాహంతో 'రెడ్ఆర్మీ'లలో చేరేవారు. పరిశ్రమలలో పనిచేసే కూలీలు తమ శక్తులన్నీ ధారపోసి, రాత్రింబగళ్లు పనిచేసి వస్తూత్పత్తి అధికం చేసేరు. తిండి—గుడ్డ, మందులు, ఇతరజీవితావసర వస్తువులు, లేకపోయినా, ఎంతబాధపడినా, బోల్షివికుప్రభుత్వంమీద తిరుగుబాటుచేయడం గాని, ఒత్తిడి కలగచేయడం గాని జరపలేదు. విధీ—విరామం లేకుండా సముద్రతరంగాలవలె వచ్చిపడుతూవున్న విప్లవప్రతికూలురతోటి, ఇంగ్లీషు—ఫ్రెంచి—ఇటలీ—జపాను—అమెరికా— ప్రభుత్వాల సేనలతోటి ఏదోవిధంగా సంధి చేసుకొనమని నిర్బంధించలేదు.

పైపెచ్చు విదేశీయప్రభుత్వాలు తమ అంతర్యుద్ధాలలో కలగచేసుకొన్నందుకై, తమ దేశాన్ని ఆక్రమించుకొన ప్రయత్నించినందులకై, ఉద్రిక్తులై వారిని తరిమివేయాలని పట్టుదలపట్టేరు. ఈ రెండు—మూడేండ్లలోను రష్యాలో కలిగిన లక్షలకొలది మరణాలకి పూచీ బోల్షివికుప్రభుత్వమే భరించాలని ప్రపంచం అంతా నిందిస్తూంది. కాని, 'మిత్రమండలి' కలుగచేసుకొని ప్రోత్సహించిన అంతర్యుద్ధాలు, బోల్షివికు ప్రభుత్వోద్యోగుల హత్యలు, హత్యాప్రయత్నాలు, తిరుగుబాట్లు, కరువులు, కాటకాలు, పోషణ—వైద్యసహాయం లేకపోవడం, మాత్రమే ఈమరణాలకి కారణం.*

౧౯౧౮—౨౦ సంవత్సరాల మధ్య 'వార్—కమ్యూనిజమ్' పోలసీని అవలంబించడానికి రెండువిధాలుగా అర్థం చెప్పుతారు. కొంతమంది కమ్యూనిష్టుసమాజాన్ని ఏర్పరచే ప్రయత్నంలో ఇది యొక మెట్టు అని చెప్పుతారు. "బ్యాంకులన్నిటిని జాతిపరం చేయడం; వాని తాలూకు స్వంతఆస్తులనుకూడా ప్రభుత్వం స్వాధీనం చేసికొనడం; పెట్టుబడిదారుల ఆస్తులనన్నిటిని స్వాధీనం చేసుకొని, పెట్టుబడిదారీవర్గాన్ని నిర్మూలించడం; భూమినంతనూ ప్రభుత్వాధికారంలోకి తెచ్చుకొనడం; పరిశ్రమలనన్నిటినీ ప్రభుత్వమే నడిపించడం; జీవితావసరాలకు కావలసిన వస్తువులనన్నిటిని ప్రభుత్వమే ప్రజలకు పంచియీయడం; వర్తకాన్ని నిషేధించి మార్కెటును పడగొట్టడం; ప్రజలందరిచేత నిర్బంధముగా పని చేయించడం; నాణ్యవిధానాన్ని రద్దుచేసి, చేసినపనికి ప్రతిఫలంగా ధనా

---

* "రెండున్నర సంవత్సరాలు నిరంతరాయంగా జరిగిన అంతర్యుద్ధం కారణంగా మొత్తంమీద ౭౦,౦౦,౦౦౦ రష్యనులు మరణించేరు."

The Economic Policy of Soviet Russia—Paul-Hansul.

నికి బదులు వస్తువులనే ఈయడం; సార్వజనికభోజనాలయాలలో భోజనము నేర్పాటుచేయడం; ఎలక్ట్రిసిటీ — నీటి—సదుపాయములుగల యిళ్ళను అందరకు ఇవ్వడం; ట్రాములు, రైళ్ళు ఉచితంగా నడిపించడం; వస్త్రాలు మొదలయిన వానిని 'పబ్లిక్‌స్టోర్సు' నుంచి సప్లై చేయడం; ఉచితంగా విద్య నేర్పడం; సినిమాలు, నాటకాలు, ఉచితంగా చూపించడం; రైతులకు కూడా వారు పండించే సరుకులు తీసుకొని వారికికావలసిన వస్తువులను సప్లైచేయడం;"—ఇంకా ఈ మొదలైన ఇతరప్రయత్నాలవల్లను పెట్టుబడిదారీసమాజాన్ని కమ్యూనిష్టుసమాజంగా మార్చవచ్చునని కొందరు బోల్షివిక్కులు చెప్పుతారు. ౧౯౧౭ తర్వాత లెనిను వ్రాసిన వ్రాతలుచూస్తే ప్రస్తుత సమాజాన్ని కమ్యూనిష్టుసమాజముగా మార్చడానికి ఎంతోకాలం పడుతుందనీ, ఆ ఆదర్శాన్ని చేరే లోపున సమాజం ఏఏఅంతరవులలోనికి ఏవిధంగా మారుతుందో, ఆర్థిక విధానాన్ని ఏయేవిధంగా మార్పులుచేయాలో, వివరంగా ముందుగానే నిర్ణయించడం కష్టమని ఊహించినట్లు స్పష్టం అవుతుంది. "దేశము లోపల వెలుపలకూడా నిరంతరం జరిగే యుద్ధాలవలన, ఆనాటి పరిస్థితుల వలన, బోల్షివికులు 'వార్—కమ్యూనిజం—పోలసీ' అవలంబించవలసి వచ్చింది. సైనికుల్నీ, పారిశ్రామికకూలీలనీ, పోషించడానికై రైతుల నుంచి వారిజీవితావసరాలకు పోగా మిగిలిన ఆహారపదార్థాలనేగాక, జీవితావసరాలకై వుంచుకొన్నవాటినుంచి కూడా కొంతభాగాన్ని తీసుకోవలసి వచ్చింది. బోల్షివికులు విదేశీయుల్ని దేశంలోనుంచి తరిమివేసి తమ అధికారాన్ని స్థిరపరచుకొనేటందుకై తాత్కాలికముగా ఈపద్ధతి అవలంబించబడింది. కాని, అది శాశ్వతం కాదు." అంటూ లెనిను ౧౯౨౧ లో వ్రాసేడు.

౧౯౨౧ లో రష్యనులు దేశములోని విషమపరిస్థితులవల్లన,

నిరంతరయుద్ధములవలన ధైర్యం కోల్పోయి నిరాశులై యున్న సమయంలోనే విదేశీప్రభుత్వాలుకూడా చాలా అలసిపోయి, తమతమ దేశాలలో శ్రామికవర్గం తిరుగుబాటు చేయడంవలన లొంగిపోయి, యుద్ధమునుంచి విరమించుకున్నారు. ఈ ౧౯౨౦ లోనే 'వార్—కమ్యూనిజం—పోలసీ' ఆఖరయింది. ఈసంవత్సరం ఆకలికి, చలికి యుద్ధంవలన పడినబాధను రష్యనులెన్నడు మరచిపోరు. ఈసంవత్సరాంతానికల్లా రష్యాలో బోల్షివిక ప్రభుత్వం స్థిరత్వం పొందింది. విప్లవవ్యతిరేకులు అందరూ విధ్వంసం చేయబడ్డారు. ఎవ్వరయినా మిగిలినవారుంటే దేశంవిడిచి పారిపోయేరు. రష్యామీద దండెత్తిన విదేశీయసైన్యాలయినా ఏకోన్ముఖంగా బోల్షివిక్సైన్యాల నెదుర్కొనలేకపోయినాయి. అంతకుపూర్వం ౭ ఏళ్ళనుంచీ జరుగుతూన్న యుద్ధాలవలన ఆదేశాలన్నీ అలసిపోయివున్నాయి. పైపెచ్చు రష్యామీది దండయాత్రను ఉపసంహరించుకోమని స్వదేశంలో కార్మికుల ఒత్తిడి ఎక్కువఅయింది. విప్లవ ప్రతికూలసైన్యాలు తమ దుష్ప్రవర్తన వలన ప్రజాసామాన్యముయొక్క సానుభూతిని ఎంతమాత్రం పొందలేకపోయినాయి. బోల్షివికుసైన్యాలకుగల వీరావేశం, పట్టుదల, దేశభక్తి, విప్లవప్రతికూలుర సేనలకు లేవు. 'మర్మాన్స్కి' 'ఆర్కేంజిలు' మొదలయిన ప్రదేశాలలో అంతవరకు స్థావరంగా వున్న బ్రిటిషుసైన్యాలు స్వదేశంకి మరలిపోయినాయి. జపానుసైన్యాలుకూడా 'వ్లాడివాస్టకు' వదలి లేచిపోయారు. బ్రిటిష్—ఫ్రెంచి—నౌకాదళాలు, తమవారినీ, బోల్షివిక శత్రువులగు విప్లవవిరోధుల్నీ, వెంటబెట్టుకొని స్వదేశాలకి తిరుగుముఖం పట్టినాయి. ౧౯౨౦ జూలయిలో బోల్షివికులు 'లట్వియా' 'లిథూనియా'లతోటి, అక్టోబరులో 'ఫిన్లండు'తోటి సంధిచేసుకున్నారు. ఆనెలలోనే సైబీరియాలోకూడా యుద్ధం పూర్తిఅయిపోయి శాంతి ఏర్పడింది. 'రాంగిల్' 'పెట్లూరా' 'బులక్—బెలహోవిచ్' 'మఖోనా'

మొదలగు విప్లవవిరోధులంతా ఓడి, పారిపోవడంచేత దక్షిణరష్యాలో కూడా ౧౯౨౦ నవంబరునాటికి శాంతినెలకొంది. మొత్తం మీద ౧౯౨౦ ఆఖరుకి రష్యానలుమూలలా శాంతి ఏర్పడింది. *

అయినా, ఇంకా పరిస్థితులు చక్కబడకపోవడంచేత, ఆతరువాత కూడా కొన్ని నెలలదాకా బోల్షివికుప్రభుత్వం 'వార్—కమ్యూనిజం—పోలసీని' నిర్బంధంగా అవలంబించవలసి వచ్చింది. యంత్రాల సాయంతో ౫గురు కాని అంతకంటె ఎక్కువమందికాని పనిచేసే ఫాక్టరీలు మొదలుకొని పెద్దపెద్ద యంత్రాలయాలవరకు అన్నిటినీ జాతీయాధికారముక్రిందకు తెస్తూ ౧౯౨౦ నవంబరులో ఒకచట్టం చేయబడింది. నాణ్యవిధానం రద్దుచేయబడడంచేత ఇంతటినుండి పన్నులు ధనరూపంలో చెల్లించనక్కరలేదనీ, ధనానికిబదులు వస్తువులనే ఇవ్వాలనీ, ౧౯౨౧ ఫిబ్రవరి ౩ వ తేదీన మరియొకచట్టం చేయబడింది. ౧౯౨౦ డిసెంబరులో వ్యవసాయం అంతా సమాజపరం చేయాలని సోవియటురష్యాలోని ౮ వ సోవియటుమహాసభ తీర్మానించింది. వ్యవసాయం సమాజపరం చేయడానికి ఎంతవరకు అవకాశాలున్నాయో తెలుసుకొనడానికీ, దేశములోని కోట్లవ్యవసాయక్షేత్రాలలోను ఎక్కడెక్కడ ఏయేపంటలు బాగా పండుతాయో తెలుసుకొనడానికీ, ప్రత్యేకకమిటీలు నియమించుటకు తీర్మానించబడింది. ఈతీర్మానాలలో దేశంలోని వ్యవసాయం అంతా ఒకే నిర్ణీతమార్గంలో ఒకేనాయకత్వంక్రింద నడిపించబడాలని సూచింపబడింది.

---

* 'వ్లాడివాస్టకు' రేవును, ౧౯౨౨, ఆఖరున, ఉత్తరసఖేలియా ద్వీపాన్ని ౧౯౨౪ ఆఖరున, కాని, జపానుసైన్యాలు ఖాళీ చేయనేలేదు."

"Economic trends in Soviet Russia"

—A. Yugov.

# ౧౯౨౧ వ సంవత్సరపు కఱవు.

౧౯౨౧ లో రష్యాలో గొప్పకఱవు వచ్చింది. అనేకరాష్ట్రాలలోకి ఈకరువు కారుచిచ్చులా వ్యాపించింది. రష్యా పెద్దదేశం కావడం చేత ఏదోఒకమూల కరువు వస్తూనే ఉంటుంది. రష్యనులకు కరువు అన్నది కొత్తవిషయం కాదు. కాని, నేటికరువు అటువంటిది కాదు. ఆనాటివరకు ఎడతెరపిలేకుండా అంతర్యుద్ధం జరుగుతూ వుండడం వలన దేశంలోని వ్యవసాయం చాలవరకు క్షీణించింది. యుద్ధం ఆగినవెంటనే మళ్ళీ కరవు. దీనితో పశుసంపద క్షీణించిపోయింది. "౧౮౯౧లో వచ్చిన కరువుకి ౧,౨౦,౦౦,౦౦౦ మంది నానాబాధలు పడ్డారు. ౧౯౦౬ నాటి కరువుకి ౨,౧౦,౦౦,౦౦౦ మందీ; ౧౯౧౧లో వచ్చిన కరువుకి ౨,౨౦,౦౦,౦౦౦ మందీ; బాధ పడ్డారు. కాని, ఈ ౧౯౨౧లో వచ్చిన కరువుకి ౪,౩౦,౦౦,౦౦౦ మంది జనసంఖ్యగల ౨౭ రాష్ట్రాలు, అంటే రష్యాలో ఇంచుమించు సగభాగం, మలమల మాడిపోయింది. ఇంతకు పూర్వం వచ్చిన కరువులలో ఎన్నడూ విత్తనాలకు కూడా గింజలులేని

రైతులసంఖ్య మూడు లక్షలకి మించలేదు. కాని, ఈకరువులో అటు వంటివారు కోటి మూడు లక్షలవరకు లెక్క తేలేరు. ఈకరువు వ్యాపించి నంత మేర జనము, పశువులు విపరీతంగా మరణించేరు. ప్రజలలో కొనుగోలు శక్తి నశించింది." ‡

---

‡After Lenin.
—M. Farbman.

## ౭

# నవీన ఆర్థిక నీతి.

## New Economic Policy. (N E P)

ఇంతకాలమూ ఎంతో ఓర్పుతో కష్టాలన్నిటినీ సహించిన ప్రజలు ఈ కరువుకి ఆగలేకపోయారు. 'టేంబోవు'—'వోల్గా'—ప్రాంతాలలోని రైతులు తిరుగుబాటుచేశారు. 'క్రాన్‌స్టాట్' దగ్గరనున్న 'రెడ్' నౌకా దళంలోని నావికులు, అచ్చటనే స్థిరంగా నిలచిపోయిన కొన్ని సైనిక దళాలు, తిరుగబడ్డాయి. ఈతిరుగబాటులో పాల్గొన్న, నావికుల కుటుంబాలు, సైనికుల కుటుంబాలు వాళ్ళవాళ్ళ స్వగ్రామాలలో కరువుకు చిక్కి నానాబాధలూ పడుతున్నారు. కమ్యూనిస్టులు వారికేమీ సహాయం చేయలేకపోయారు. ఆఆవేశంతో "కమ్యూనిస్టులులేని సోవియట్లు కావాలి" (Soviets without the communist party) అనే హెచ్చరికలతో నాలుగుమూలలా తిరుగుబాట్లు బయలుదేరినాయి. అది చూడగానే 'లెనిను' 'వార్—కమ్యూనిజం—పోలసీ' వదల వలసిన సమయం వచ్చిందని గ్రహించేడు. ఇక్కడ మనం లెనిన్ చాకచక్యాన్ని మెచ్చుకొనక తప్పదు. తన

ఆదర్శాన్ని వదలిపెట్టకుండానే, ఆఆదర్శాన్ని చేరడానికి అవలంబించ వలసిన పద్ధతుల్ని సమయానుగుణ్యంగా మార్పు చేసుకొనడానికి తగిన తెలివితేటలు, సమయస్ఫూర్తి ఒక్క ఆతనిలోనే మూర్తీభవించేయి. ప్రభుత్వం 'క్రాన్‌స్టాట్' తిరుగుబాటును అణచివేసింది. కాని, ౧౯౨౧ మార్చిలో జరిగిన కమ్యూనిస్టుపార్టీయొక్క ౧౦ వ సమావేశంలో "వార్—కమ్యూనిజం—పోలసీని" విడిచిపెట్టాలంటూ 'లెనిను' ఒక తీర్మానం తీసుకొనివచ్చేడు. ఆతీర్మానం అధికసంఖ్యాకుల సమ్మతి పొందింది. ఈమార్పుకు అంతా ఆశ్చర్యపడ్డారు. రైతులనుంచి నియమం—నిర్ణయంలేకుండా వారి సామర్థ్యాన్ని మించి సరుకులను తీసుకొనే పద్ధతి రద్దుచేసి, వారు సేద్యం చేసుకొనే భూమినిపట్టి పన్నుయిచ్చే పద్ధతిని ఏర్పాటుచేశారు. అవసరాలకిపోగా మిగిలిన సరుకుల్ని బజారులో వారికి తోచినఖరీదుకు అమ్ముకునేటందుకు రైతులకు అధికారమలీయబడినాయి. వారు చేసిన రెండోమార్పు అదివరకు రద్దుచేసిన నాణెముల పద్ధతిని, కరెన్సీపద్ధతిని కూడ పునరుద్ధరించడం. ధనము సేకరించడం, ఖర్చు పెట్టుకొనడంలోగల నిర్బంధాలన్నీ రద్దు చేయబడినాయి. ౧౯౨౧ జూలై ౯ వ తేదీన రైల్వేరేట్లను నిర్ణయిస్తూ ఒకచట్టం చేయబడింది. "ఆగస్టు ౧ వ తేదీన తపాల తంతిరేట్లను నిర్ణయిస్తూ ఒకచట్టం చేయబడింది. సెప్టెంబరు ౧౫ వ తేదీన వేరొక చట్టం ద్వారా ట్రాములకు, నీటిగొట్టాలకి, లాండ్రీలకి, ఎలక్ట్రిసిటీకి, స్నానగృహాలకి, రేట్లు ఏర్పరచబడినాయి." * ఆగష్టు ౧౨ వ తేదీన చేయబడిన చట్టము ద్వారా జాతీయసంస్థలుగా నిర్ణయించబడిన ఫాక్టరీలన్నీ స్వతంత్రసంస్థలుగా చేయబడినాయి. ఈఫాక్టరీలకు ప్రభుత్వం ఏవిధమైన సహాయం చేయదు.

---

* After Lenin.

—M. Farbman.

తమకు కావలసిన బొగ్గు, ముడిసరుకులు వగైరాలన్నిటినీ ఆఫాక్టరీ కమిటీలే కొనుక్కొని తాము తయారుచేసిన సరుకుల్ని తోచిన ధరలకు అమ్ముకొని, కార్మికులకి జీతాల నిచ్చుకోవాలి. ఆఫాక్టరీలు ప్రభుత్వమున కేవస్తువు నుచితంగా నీయనక్కరలేదు. ఈవిధంగా అంతవరకు ప్రభుత్వంచేత నడిపించబడుతూన్న ఫాక్టరీలన్నీ అచ్చటి కూలీల చేత ఎన్నుకొనబడే సంఘాలచేతనే నడిపించబడుతూ వర్తకవ్యవహారాలు స్వతంత్రంగా చేసుకొనేటందుకు సర్వాధికారాలు పొందినాయి. తర్వాత ఆమాసం లోనే యంత్రాలయాలకి కావలసిన ముడిసరుకుల్నీ, కార్మికులకు కావలసిన ఆహారపదార్థాల్నీ కొన్నుక్కునేటందుకై హక్కును పొందినాయి. అక్టోబరు ౨౧ వ తేదీన తయారయిన చట్టముతో తనసరుకులను బజారులో అమ్ముకొనేటందుకు హక్కును పొందినాయి. ఈవిధంగానే "నవీన ఆర్థిక నీతి" అతిస్వల్పకాలంలో అమలులోకి తేబడింది.

ఈవిధంగా 'నవీన ఆర్థిక నీతి' అవలంబించిన తర్వాత ఉత్పత్తి వ్యాపారాలు కొత్తగా నెలకొల్పడానికీ, అనేకరకాల చిన్నచిన్న వ్యాపార సంస్థలు ఏర్పడడానికీ, దేశంలో వర్తకవ్యాపారాలభివృద్ధి పొందడానికీ, కొంతకాలం పట్టింది. బోల్షివికులు 'వార్—కమ్యూనిజం—పోలసీ'ని వదులుకొని "నవీనఆర్థికనీతి"ని అవలంబించగానే బోల్షివికుశత్రువులూ, మిగిలిన కాపిటలిస్టుదేశాలూ హేళనచేయడానికి అవకాశంచిక్కింది .'సమిష్టి స్వామ్యం' ఆచరణలో సాధ్యం కాదు. కనకనే 'నవీన ఆర్థిక నీతిని' అవలంబించవలసివచ్చిందని ప్రచారం సాగించేరు. దీనినిచూసి జమీందార్లను, పెట్టుబడిదార్లను, సంఘంలోంచి తొలగించే ప్రయత్నాలను బోల్షివికులు మానుకుంటారని అందరూ అనుకున్నారు. ఈవిధంగా వెనుకకు తగ్గడం శక్తి-యుక్తులు-కూడదీసికొని రెట్టింపు వేగంతో ముందుకు సాగడంకోసమేననీ, కర్తవ్యవిధానాన్నుంచి దారితొలగడం కాదనీ,

లెనిను వాదించేడు. బ్యాంకులు, విదేశవర్తకం, రహదారీలు, రైలుమార్గాలు, పెద్దపెద్ద నగరాలలోని కట్టడాలు — నివేశనాలు, గనులు, విద్యుదుత్పత్తి సంస్థలు, లోహపరిశ్రమలు, ఇతరములైన పరిశ్రమలు, ప్రభుత్వం చేతిలో ఉన్నంతకాలం చిన్నచిన్న రైతులకు సరుకులనమ్ముకొనే అధికారం, చిన్నహోటళ్ళు, కాఫీహోటళ్లు, కిళ్లీదుకాణాలు, ఇతరములైన చిల్లరదుకాణాలు, ప్రత్యేకవ్యక్తుల స్వాధీనంలో ఉన్నంత మాత్రంచేత నష్టంలేదు. కమ్యూనిస్టుసమాజం ఏర్పడడానికి అవి అభ్యంతరం కానేరవు. ఆయువుపట్టులను గుప్పిట పట్టుకొని, చిన్నచిన్నవానిని తాత్కాలికంగా విడిచిపెట్టడంచేత కమ్యూనిస్టుసమాజ నిర్మాణానికి అభ్యంతరం కలగదనీ, ప్రభుత్వం కాలూ-చేయి కూడదీసుకొని తిరిగి వీటిని స్వాధీనం చేసుకుంటుందనీ, లెనిన్ చెప్పేడు. దేశంలో గల సహజసంపదలన్నిటిని ఒకేమారు అభివృద్ధిలోనికి తేవడం ఏప్రభుత్వానికీ సాధ్యపడదు. అందుచేత ఆసహజసంపదలను పూర్తిగా వినియోగంలోనికి తెచ్చి, ఉత్పత్తినెక్కువచేయుటకు సమర్థులైన విదేశీయులగు పెట్టుబడిదారులను కొందిరిని, కొన్ని నిబంధనలకి లోబరచి కొంతకాలంవరకు సహకారులుగా ఉండేటందుకు ఏర్పరచుకొనడానికి, ఏబోల్షెవికు ప్రభుత్వమూ వెనుకాడదు. లాభాలు తీసే అవకాశాలు సమాజం యొక్క మంచి—చెడ్డలకి ఎంతవరకు బాధ్యతకలిగిఉంటాయో కొందరు బోల్షివికులు సరిగ్గా గ్రహించలేకపోయారు. మొట్టమొదట్లో ఆఅవకాశాలు ఉత్పత్తి అధికం కావడానికి సహాయపడతాయి. రైతులు—కూలీలు తమతమవస్తువుల్ని యితరులసహాయం లేకుండా మార్చుకుందుకు వినియోగిస్తాయి. కాని, కొంతకాలమైనతర్వాత దానివలననే సమాజంలోని స్వార్థపరత్వం హెచ్చి అనేకనష్టాలుకూడా కలుగుతాయి. ఏనాడో ఈ ముఖ్యమైన స్వలాభాపేక్షకుగల్ల అవకాశం తర్వాత తర్వాత అనేకరూపాలు ధరించి సోవియటు

ప్రభుత్వాన్ని నేలకూల్చడానికే ప్రయత్నించింది. మొట్టమొదట్లో ఈ యవకాశాలు ఒక్క రైతులకు మాత్రమే కల్పించబడినాయి. కాని, క్రమక్రమంగా ఇతరపరిశ్రమలతోపాటు ప్రభుత్వపరిశ్రమలలోకూడా ఎక్కువ శ్రమపడి అధికోత్పత్తికి తోడ్పడినవారికి ఆ శ్రమఫలితం లభించే వీళ్లు కల్పించబడినాయి. ప్రభుత్వం తనకి కావలసిన వస్తువులన్నీ ఒకనియమం— నిర్ణయం లేకుండా రైతుల వద్దనుంచి తీసుకొనడం మాని స్థిరమైన శిస్తు ఏర్పాటు చేయడంచేత రైతులకు వ్యవసాయంలో ప్రోత్సాహం కలిగింది. ఈవిధంగానే పరిశ్రమలలో పనిచేసే కూలీలకు కూడా ప్రభుత్వం చేయూత నిచ్చింది. దానికి ఫలితంగా వారు నశింపచేయాలనుకుంటూన్న పెట్టుబడిదారీవర్గం అస్పష్టంగా ఏర్పడి క్రమక్రమంగా విజృంభించసాగింది. అటుతర్వాత కూడా ఇటువంటి సౌకర్యాల నెన్నిటినో కలగచేయవలసిన అవసరం ఏర్పడింది. *

ఈనవీనఆర్థికనీతివలన కలిగే చెడుగులనుకూడా బోల్షివికులు గ్రహించక పోలేదు. ప్రభుత్వంచేత ప్రత్యేకవ్యక్తులచేత నడిపించబడే

---

* ౧౯౨౪ లో ప్రభుత్వంనుండి అనుమతిపొందిన షాపుల సంఖ్య ౮౬౦౯౦౩. యుద్ధానికి పూర్వం రష్యాలో ౧౩౫౦౦౦ షాపులుండేవి. అంటే 'నవీన ఆర్థిక నీతి' అవలంబించబడిన 3 ఏండ్లలో పూర్వపువర్తకంలో చెరిసగం కోల్కొంది. ఈ ౮౬౦౯౦౩ షాపులలో ప్రభుత్వాధీనంలో ౧౧౯౧౫ షాపులు, కోఆపరేటివుసొసైటీల అధీనంలో ౨౬౬౮౭ షాపులు, మిగిలినవి ప్రత్యేకవ్యక్తుల అధీనంలోను వున్నాయి. ఈవిధంగా వ్యక్తిలాభాలకి తావీయగానే పెట్టుబడిదారీవర్గము విజృంభించ సాగింది.

After Lenin—P. 106-7.
—M. Farbman.

సంస్థలన్నిటికీ ఒకేఒకనిబంధనావళి కావలసియున్నదని వారు గ్రహించేరు. ఈఉద్దేశ్యంతో నేం౧౯౨౦లో రష్యాకంతటికీ విద్యుచ్ఛక్తి సరఫరా చేయడం విషయమై అంచనాలను తయారుచేయడానికి ఒక ఉపసంఘాన్ని నియమించేరు. ఆసంఘం తనరిపోర్టును ౮ వ సోవియటుకాంగ్రెసునకు అందించిందికూడా. ఈఉపసంఘనియామకంవలన విద్యుచ్ఛక్తికోసమే గాక జాతీయార్థికజీవితాన్నంతనీ ఒకే క్రమపద్ధతిలో నడిపించడానికి అవకాశాలున్నాయని తేలింది. ఈమాదిరిగా అంచనాలు వేసి, ఉత్పత్తిసంపకములను వెంటనే మార్చివేయడానికి అవకాశాలు లేవు. కాని, దేశం మొత్తంమీద ఆర్థికవిషయమై అంచనాలువేసి వానిని అనుసరించడం వలన ఉత్పత్తిదారులయొక్కా, వర్తకులయొక్కా స్వలాభాపేక్షను కొంతవరకు అదుపాజ్ఞలలో ఉంచవచ్చునని వారు నిర్ణయానికి వచ్చేరు.

ఈవిధంగా ఒకసామాన్యకట్టుబాటుకు లోబడి 'నవీనఆర్థికనీతి' ఒకదశపాటు సాగితే సోషలిస్టుసమాజం ఏర్పరచడానికి అవకాశంవుందా? లేదా? అనికాదు మన చర్చ. కాని, ఆనీతి అవలంబించిన కొద్ది కాలానికే దేశం నాలుగుమూలలా దినదినాభివృద్ధి పొందుతూ వచ్చిన వ్యక్తిసంస్థల్ని అణచివేయడం ఆరంభించేరు. ఆకారణంచేత 'నవీన ఆర్థికవిధానాన్ని' అవలంబించినరోజున సోవియటు ప్రభుత్వం పెట్టుబడిదారీవిధానాన్నే స్వీకరించిందని హేళన చేసినవారంతా తమ ఉద్దేశాలను మార్చుకోక తప్పిందికాదు. 'నవీనఆర్థికనీతి'ని అవలంబించిన ఏడాది లోపుననే లాభాలుతీసేవానిని తొలగించే ప్రయత్నాలు ఆరంభించేరు. ప్రభుత్వంచేత, మునిసిపాలిటీలచేత, మరియితర సంస్థలచేత నడిపించబడే Trust లను పెంచివేశారు. వర్తకంద్వారా లాభాలను తీసేవారికి కొన్నిఅసౌకర్యాలు కలిగించేరు. వారిపై అదనపుపన్నులను వేసి, సరుకులను అందకుండా చేసి, వారికి సాయం చేస్తూన్న విదేశీయుల్ని తరిమి

చేసి, వారిక్రింద పనిచేసే కూలీలచేత ఎక్కువజీతాలకోసం సమ్మెలు చేయించి, ఖాతాదారుల్ని ఆకర్షించడానికి వారు చేసే ప్రదర్శనాలను పోలీసులద్వారా ఆటంకపరిపించి, వ్యక్తివ్యాపారసంస్థల్ని అణచివేశారు.

ఈవిధంగా 'నవీనఆర్థికనీతి' అవలంబించబడిన వెంటనే ఒక్కమారు విజృంభించిన చిన్నచిన్న పెట్టుబడిదారుల్ని, ఒక్కమారుగాకాక క్రమక్రమంగా కొన్నిఏళ్ళలో అనేకశాసనాలద్వారా వారి వ్యాపారాలను అడ్డగించి నెమ్మదిగా అణిచివేశారు. ప్రథమపంచవర్షప్రణాళిక ఆరంభమైన ౧౯౨౮ నాటికి రష్యాలోని నగరాలన్నిటిలో ఈపని పూర్తి అయింది. ౧౯౨౧—౨౭ సంవత్సరాలమధ్య షాపులు—భోజనశాలలు స్థాపించి లాభాలు తీస్తూవున్న అనేకలక్షలమందిలో కొందరు చచ్చిపోయారు. కొందరు దేశం విడిచి పారిపోయారు. కొందర్ని జైళ్ళల్లో తోసేశారు. సగం మందికి పైగా కూలీ—నాలీ చేసుకొనడం ఆరంభించేరు. మిగిలిన వాళ్ళెవరేనా వుంటే వారికి ఏహక్కులూ లేకుండాచేసి అణిచిపెట్టేరు.

పట్టణాలకు కావలసిన సరుకులన్నిటిని తయారుచేయగలశక్తి ౧౯౨౯ నాటికే సమిష్టిఉత్పత్తిసంస్థలకి కలిగింది. అంతవరకు లాభాలనుతినే వ్యక్తుల్ని తొలగించి వారికి బదులుగా ఉత్పత్తివిషయంలో బాధ్యతను వహించడానికి "సుప్రీం ఎకానమిక్ కౌన్సిలు" స్థాపించబడింది. అనేకవేల ఫాక్టరీలు, 'ట్రేడ్—యూనియన్లు' ఈ "సుప్రీం ఎకానమిక్ కౌన్సిలుకు" లోబడి ఉత్పత్తిని అనేకరెట్లు పెంచేటట్లు చేయబడింది. ఇవేకాక మాస్కో, లెనిన్‌గ్రాడ్, ఖార్కోవ్, రాస్టోవ్ మొదలైన నగరాలలోగల బ్రహ్మాండమైన కర్మాగారాలు; R. S. F. S. R. యూక్రెయినులలోని ఉత్పత్తిసంస్థలుకూడ ఈకార్యక్రమంలో సాయం చేశాయి. సరుకుల పంపకం విషయంలో దేశం నలుమూలలా వ్యాపించియున్న సహకారసంస్థలు ప్రజలకెంతో తోడ్పడ్డాయి.

కాని, ప్రజలయొక్క నిత్యావసర వస్తువులలో కొన్నిటిని తయారుచేయడానికి ప్రభుత్వానికి అప్పటిలో సాధ్యపడలేదు. లాభాపేక్షులైన వ్యక్తులకు అవకాశాలు ఇచ్చియుంటే ప్రజలకి తాత్కాలికంగా ఎక్కువసౌకర్యాలు కలిగించియుందురని ప్రభుత్వమే ఒప్పుకుంది. గొప్ప ఆదర్శాలకోసం పోరాడుతూన్న ప్రజలు ఇంతమాత్రపు స్వల్ప త్యాగం చేయడానికి వెనుతీయలేదు. ప్రజలకు సరిపడేటన్ని భోజన పదార్థాలను ఉత్పత్తిచేయడం ఏలాగా అన్నదే ఆరోజులలో ప్రభుత్వాన్ని, కమ్యూనిస్టుపార్టీసభ్యుల్ని ఎదుర్కొన్న ప్రధానసమస్య. ఈవిషయంలో వారు చేసిన ఏర్పాటులను పరిశీలించేముందు 'నవీనఆర్థికనీతి'ని వదలడం వలన కలిగిన ఫలితాలను ముందుగా తెలుసుకోవాలి.

౮

# "ఇంటెలిజెన్షియా" పై ("విద్యావంతులు") ఒత్తిడి కలగజేయుట.

౧౯౨౦-౨౮ ల మధ్య సోవియటు ప్రభుత్వం యొక్క రాజ్యాంగ నీతి నిరంతరం మారుతూ వుండడం వలన ప్రజాసామాన్యం గందరగోళంలో పడిపోయింది. పెద్దపెద్దఉద్యోగాలలో ఉండి డబ్బుకూడబెట్టి వడ్డీకి యిచ్చేవారిని ప్రభుత్వం మాపేసింది. సాధ్యమైనంత తక్కువ ధరలకు కొని వీలయినంత ఎక్కువ ధరలకు అమ్మేవర్తకులను నిర్మూలించేరు. ఎక్కువకూలీలను పెట్టి. ఉత్పత్తి హెచ్చించి లాభాలులాగే పెట్టుబడిదారులను చంపేసీ—ఖైదుచేసి—బోల్షివికులు అణచివేశారు.

పైన చెప్పినవర్గాలవారు అక్టోబరు విప్లవంలో కాని, దాని వెన్నంటియే ఏర్పడ్డ బోల్షివిక ప్రభుత్వంలోకాని, కలగచేసికొనక దూరంగానే ఉండిపోయారు. జారుచక్రవర్తుల ప్రభుత్వకాలంలో పెద్దపెద్ద ఉద్యోగాలలోయున్న ఇంజనీర్లు, మేనేజర్లు, శాస్త్రవేత్తలు మొదలయిన వారంతా విప్లవానంతరం కూడా దేశంలోనే ఉండిపోయేరు. వీరంతా

'వార్—కమ్యూనిజం' కాలంలో మహాదరిద్రమైనా అనుభవించడానికి అంగీకరించేరు. కాని, బోల్షివిక్కుప్రభుత్వంక్రింద పనిచేయడానికిమాత్రం అంగీకరించలేదు. ౧౯౨౧ లో బోల్షివికులు నవ్యఆర్థికనీతిని ప్రకటించేరు. అప్పుడు వీరంతా బోల్షివికులు తమ కార్యవిధానం ఆచరణ యోగ్యం కాకపోవడంచేత దానిని వదిలేసి 'నవీన ఆర్థిక నీతిని' అవలంబించేరని ఊహించేరు. స్వేచ్ఛావాణిజ్యానికి వీలు కలుగచేయబడిందనీ, స్వేచ్ఛగా ఎవరికితోచినంత వారు ఉత్పత్తి చేసుకోవచ్చుననీ, ఎవ్వరి శక్తికొలదీ వారు డబ్బు కూడబెట్టుకోవచ్చుననీ పొరపాటుపడ్డారు. వెంటనే అప్పుడప్పుడే దేశం నాలుగుమూలలా స్థాపించబడుతూన్న పరిశ్రమలలో చేరేరు. వీరిలో చాలామంది ఎంతోశ్రద్ధచూపించి తమకు వప్పగించబడిన పనులు పూర్తిచేశారు. కాని, పెట్టుబడిదారీవిధానము నందే నమ్మకంగల వీరిని బోల్షివికులుమాత్రం నమ్మక, ఎప్పుడూ ఒకకంట కనిపెట్టిచూస్తూనే ఉండేవారు. 'నవీన ఆర్థిక నీతి'ని అవలంబించడం కారణంగా దేశం అంతటా విజృంభిస్తూన్న ధనికవర్గాన్ని సోవియటుప్రభుత్వం మరల నిర్మూలించడానికి ప్రయత్నాలు ఆరంభించింది. అంతవరకూ ధనికవర్గం మరల తలయెత్తుకొనడానికి అవకాశం ఈయబడిందనే ఊహిస్తూన్న Intelligentia వెంటనే సోవియటు రాజనీతిని విమర్శించడం ఆరంభించింది. విమర్శనలతో ఆగక వీరు ప్రభుత్వాన్ని కూలద్రోయడానికే కుట్రలు సాగించేరు. పనికట్టుకొని పరిశ్రమలను ధ్వంసం చేయసాగేరు. కుట్రలవల్లనయితేనేమి? పొరపాట్లవలన అయితేనేమి?—అప్పుడప్పుడే కోలుకొంటూన్న పరిశ్రమలు చెడిపోవడం ఆరంభించగానే బోల్షివికులకు ఈవర్గంమీద అనుమానం ఎక్కువ అయింది. ౧౯౨౭-౧౯౨౮ సంవత్సరాలలో 'డానిట్జి బేసిన్' బొగ్గుగనులలో పనిచేస్తూన్న రష్యను టెక్నీషియనులు, 'జర్మ

మంతో కలిసి కుట్రయపన్ని పరిశ్రమలు నాశనం చేస్తున్నారని తీవ్రంగా శిక్షించబడ్డారు. అనుమానం ఉన్నవారి సందర్నీ ఉద్యోగాలనుంచి లాగేసి అరెస్టు చేశారు. ౧౯౩౦వ సంవత్సరంలో సోవియటుల పరిపాలనను విమర్శిస్తూ ఒక విదేశీపత్రిక ఈలాగ వ్రాసింది.

"౧౯౩౧ నాటికి రష్యాపరిశ్రమలలో పని చేస్తూన్న అనేక వందలమంది స్పెషలిస్టులు తమ ఉద్యోగాలనుంచి తొలగించబడ్డారు. ఆనాటికి రష్యనుశ్రామికవర్గం లోనుంచే ఎంతోమంది ఇంజనీర్లు, ప్రొఫెసర్లు, టెక్నీషియన్లు, బయలుదేరేరు. అంతవరకు పనిచేస్తూన్న కుట్రదారులు తొలగించబడగానే వీరు ఆ స్థానాలలో ప్రవేశపెట్టబడ్డారు. ౧౯౨౯ నాటికి ప్రజలయొక్క జీవిత పరిస్థితులు ఇంకా బాగుపడలేదు. ప్రభుత్వం పంచవర్షప్రణాళికను నెగ్గించడానికై అందర్నీ ఆహ్వానిస్తూంది. కాని, చాలమంది ఇంజనీర్లు, ప్రొఫెసర్లు "మనం ఎందుకు శ్రమపడాలి? ఇది మన ప్రభుత్వం కాదు; దీని కోసం మనం ఎందుకు త్యాగం చేయాలి? మనశ్రమకి సరిపడ్డ ప్రతిఫలం లేకపోవడం సరికదా, ఎదురు జెయిళ్ళు ప్రవాసాలు, విధిస్తున్నారు." అని ఊహించి కుట్రలు సాగించేరు. ౧౯౨౯లో ఆరంభించిన సమిష్టి వ్యవసాయనిర్మాణప్రయత్నాలకి అంగీకరించక రైతులు ప్రభుత్వం మీద తిరగపడ్డారు. ౧౯౩౦వ సంవత్సరం మొదటి మూడు నెలలలోను విదేశీయప్రభుత్వాలు తమమీద దాడి చేస్తాయని 'స్టాలిన్' అనుకున్నాడు. దేశంలోని పరిస్థితులన్నీ విషమించేయి." *

---

* పంచవర్షప్రణాళికను అమలులో పెట్టగానే 'ఖార్కొవ్' లో ఒక గొప్పకుట్రనేరం బయటపడింది. ౧౯౨౯ సంవత్సరం ఆకురాలుకాలం వచ్చేలోపుగానే అనేకమంది అరెస్టు చేయబడ్డారు. కొంతమందిని విచారణకూడా చేయకుండా కాల్చిపారవేశారు. ౧౯౩౦ మార్చి-ఏప్రియలు

మాసాలలో ౮౨౧ గురుఅరెస్టు చేయబడ్డారు. వీరిని ఖార్కోవ్ నాటకశాలలో అతిరహస్యంగా విచారణ చేశారు. ఈకుట్రనేరం క్రింద విచారింపబడిన వారంతా బడిపంతుళ్ళు, వైద్యులు, పండితులు, కవులు, మతబోధకులు, మొదలయినవారే. 'యూక్రేనియన్ ఎకాడమీ ఆఫ్ సైన్సెస్' లో సభ్యుడైన 'ఇఫ్రిమోవ్' కూడా వీరిలో యున్నాడు. 'యూక్రేనియా స్వాతంత్ర్య సమితి' అనేపేరుగల సంఘం స్థాపించి 'యూక్రెయిను రాష్ట్రాన్ని' సోవియటురష్యానుంచి విడతీయాలని ప్రయత్నం చేసినట్లు వీరిమీద నేరం మోపబడింది. అందరికీ ప్రవాసశిక్షలు విధించబడినాయి. 'యూక్రేనియన్ ఎకాడమీ ఆఫ్ సైన్సెస్' లోని పూర్వపు సభ్యులంతా తొలగించబడి బోల్షివికులు తిరుగాఎన్నుకోబడ్డారు. కుట్రతో సంబంధం వున్నదని అనుమానించిన యూక్రేనియను చర్చిని కూడా నిషేధించేరు. "గక్తమార్గము", "జీవితము — విప్లవము", మొదలైన పత్రికలు నిలిపివేయబడినాయి. 'యూక్రేనియా ప్రభుత్వ ప్రకటనశాఖ' నిలపివేయబడి దానిస్థానే "యూక్రేనియా సమ్మిళిత ప్రచురణాలయం" స్థాపించబడింది.

౬

# పరిశ్రమలలో పనిచేసే కుట్రదారుల విచారణ.

౧౯౩౦ లో ౮గురు సోవియటుఇంజనీర్లపైన ప్రభుత్వాన్ని కూల ద్రోయడానికై రహస్యరాజకీయసంఘాలు స్థాపించి దేశంలో ప్రచారం చేశారనీ, రష్యామీదికి దండెత్తి రమ్మని ఫ్రాన్సును ప్రోత్సహించేరనీ, దేశంలో ఆర్థికప్రతిష్టంభనం కలగచేశారనీ, నేరారోపణచేసి ౫గురను ఉరితీసి మిగిలిన ఇద్దరికీ చెరి ౧౦ఏండ్లు కఠినశిక్ష విధించేరు. ఇదే ప్రసిద్ధిగాంచిన 'ప్రోమ్-పార్టీ' విచారణ. సోవియటుప్రభుత్వం ఈ నేరాన్ని విచారణచేసి ప్రొఫెసర్ 'రాంజిన్' మొదలయిన వారికి ఉరిశిక్షలు, కారాగృహశిక్షలు, విధించగానే Intelligentia అంతా గజగజ లాడిపోయారు. అనేకవేలమంది ఉద్యోగులు దేశంలోని మారుమూలలకు బదిలీచేయబడ్డారు. అనుమానం తగిలితేచాలు ప్రభుత్వం ఏమాత్రపు సాక్ష్యము కోరకుండానే అరెస్టుచేసి కఠినశిక్షలు విధించింది. ఇంజనీర్లు, ప్రొఫెసర్లు, మతాచార్యులు, అయితేసరి, ప్రభుత్వం వారిమీద నిఘా

ఉంచిందన్నమాటే జైళ్ళన్నీ నిండిపోయినాయి. దేశములోని యంత్ర శాలలలో మేనేజర్లు, టెక్నీషియనులు, కరవైపోయారు. "సుప్రీమ్ ఎకానమిక్ కౌన్సిలు" అధికారులు ఆసమయంలో "ఓగ్పూశాఖ వారూ—వీరూ అనకుండా ఇంజనీర్లు, టెక్నీషియన్లు మొదలయిన వారందరినీ నిర్బంధించడంవలన దేశంలోని పరిశ్రమలు వెనకబడుతున్నాయ"ని ప్రభుత్వానికి రిపోర్టు చేశారు. దీనితో శిక్షావిధానంలో చాలవరకు మార్పు కలిగింది. ఉరిశిక్షలు నిలిపివేయబడ్డాయి.

రష్యనుఇంజనీర్లు పరిశ్రమలను నాశనం చేయడానికై కుట్రలు పన్నడం నిజమే. ఏమీ సందేహం లేదు. ఆరోజులలో రష్యాలో పని చేసిన అమెరికనుస్పెషలిస్టులు చాలమంది ఈవిషయం నిజమేనని అనేక మారులు ప్రకటించేరు. కాని, ఎవ్వరో కొందరు చేసిన పనికి దేశంలోని ఇంజనీర్ల నందర్నీ దోషి—నిర్దోషి అనే విచక్షణ లేకుండా శిక్షించడం మాత్రం మంచిపని కాదు.

౧౦

# 'మెన్షివిక్' నాయకుల విచారణ.

1931 వ సంవత్సరం మార్చినెలలో ఇంకొక గొప్పకుట్రనేరం బయలుపడింది. ప్రభుత్వోద్యోగులు, ప్రొఫెసర్లు, మొదలైనవారు 14గురు అరెస్టుచేయబడ్డారు. 'గాస్ప్లాన్' (Gosplan) తయారుచేయునప్పుడు సాధ్యమైనంత తక్కువ అంచనాలను వేసి ఉత్పత్తిని త్వరగా అభివృద్ధి పొందకుండా ప్రయత్నాలు చేసిన 'గ్రోమన్'కూడ వీరిలో ఉన్నాడు. రష్యాలోని ఇతరప్రాంతములలోని 'మెన్షివికుల'తోను ఇతరదేశములలోని తమమిత్రులతోను, కలసి ప్రభుత్వాన్ని కూలద్రోయుటకు కుట్రలుచేసేరని వీరిమీద నేరము మోపబడింది. విప్లవము రాగనే రష్యాలోని పెట్టుబడిదారులు 'పారిసు' 'లండను' నగరాలకు పారిపోయి అచ్చటినుండియే బోల్షివికుప్రభుత్వమును కూలద్రోయుటకు, రష్యాలోని పరిశ్రమలను నాశనము చేయుటకు ప్రయత్నించే కొన్నిసంఘాలకు ప్రోత్సాహము కలిగించేవారు. 'Second international' యొక్క రష్యాశాఖ అయిన

'రష్యన్ సోషల్ డెమోక్రెటిక్ పార్టీ' దాకా యీమాదిరి కుట్రలలో ముఖ్యముగా పాల్గొనుచుండెడిది. వీరినందరను అణచివేయుటకు ఈకుట్ర విచారణ జరుపబడింది.*

---

* బోల్షివికులలో నాయకులను చంపి సాయుధవిప్లవముద్వారా ప్రభుత్వమును తమస్వాధీనము చేసుకొనుటకు 'Second international' లోనివారగు 'సోషల్ రివల్యూషనరీలు' ప్రయత్నిస్తూ ఉండెడివారు. వారిని నిర్మూలించడానికై 1922 లో ఇట్టిదే ఒకవిచారణ జరుపబడింది. 1931నాటి కుట్రలోకూడ ఈపార్టీకి చెందినవారుకూడ చాలమంది ఉన్నారు. వీరివిచారణ న్యాయముగా జరిపించుటకు ఆపార్టీలో పేరు పొందిన 'లీబ్నిచ్' (Lebknecht) 'రోజన్‌ఫీల్డు'లతో బెల్జియమ్ మాజీ మంత్రి'ఎమిలీ వాన్డర్‌వాల్డీ'(Emile vandervelde)మాస్కోకు వచ్చేరు. కాని మాస్కోలో వీరికి అంతగా గౌరవం చూపబడలేదు. అందుచేత 'Second international' కు, కేసువిచారణ నిష్పక్షపాతంగా జరుగుతుందనే ఆశనశించింది. R. S. F. S. R. లోని intellingenteia ను భయపెట్టుటకు పెద్దపెద్ద శిక్షలు వేయకతప్పిందికాదు. ముద్దాయిలలో 12 మందికి మొదట ఉరిశిక్షవేసి తరువాత దానినే ద్వీపాంతరవాసశిక్షగా మార్చేరు.

## ౧౧

# స్టాలిన్ ప్రకటన.

ఈసమయంలో సోవియటుప్రభుత్వం Intelligenteia మీద సాగిస్తూన్న నిర్బంధవిధానపద్ధతి హఠాత్తుగా ఒక్కమారుగా ఆగిపోయింది. అప్పుడు మాస్కోలోనే యున్న ఒక అమెరికాదేశీయుడు నాటి పరిస్థితుల్ని గురించి ఈవిధంగా వ్రాసేడు.

"౧౯౨౯—౩౧ సంవత్సరాల మధ్య రష్యాలోని ఇంటిలిజెన్షియా ఎన్నో కష్టాల ననుభవించింది. ౧౯౩౧ లో వారి స్థితి కొంచెం బాగుపడింది. ౧౯౩౨ నాటికి వారికి చాలావరకు స్వాతంత్ర్యం లభించింది. కొత్తహక్కులు, కొత్తసౌకర్యాలు లభించేయి."

౧౯౩౧ లో 'గ్రోమన్' మొదలగువారి విచారణ జరిగిన కొద్దినెలలకే, అంటే ఆఏడాది జూన్ ౨౩వ తేదీన, సోవియటుప్రభుత్వం తన భవిష్యన్నీతిని గురించి ఒక ప్రసిద్ధమైన ప్రకటన చేసింది. ఆనాటివరకు ఛాందసులైన బోల్షివికులకు ఇంటిలిజెన్షియాను నాశనం చేస్తేగాని శ్రామిక

వర్గం బాగుపడవనే మనభిప్రాయం ఉండేది. కాని, స్టాలిన్ ప్రకటన బోల్షివికుల ఈ అభిప్రాయం పొరపాటని ప్రకటించింది. "ఇంతవరకు ప్రపంచంలో ఏ ప్రభుత్వం కూడా ఇంటిలిజెన్షియా వర్గం యొక్క సహాయం లేనిదే సాగలేదు. సోవియటు ప్రభుత్వం అయినా అంతే. అందుచేతనే మనం వారిని మంచిదారిలోకి తెచ్చి ప్రోత్సాహం చూపించాలికాని, నిరుత్సాహపరచి క్రూరంగా అణచివేయకూడదు. బోల్షివికులు కానంతమాత్రంచేత వారిని అర్హములగు స్థానాలనుండి తొలగించకూడదు. ౧౯౧౭ వరకు జారుప్రభుత్వం క్రింద పనిచేసి నేడు సోవియటు ప్రభుత్వాధికారంలో పని చేస్తూన్న 'బూర్జువా స్పెషలిస్టు'లను కూడా మనం గౌరవించాలి. వారిని మనలోనికి ఆకర్షించగల పద్ధతుల నవలంబించి మనతో సమానంగా గౌరవించాలి. ఇంతటినుంచీ స్పెషలిస్టులనూ, ఇంజనీర్లనూ అణచివేయడం మానుకోవాలి. అటువంటి పద్ధతి ఇకముందునుంచి ప్రమాదకరంగా పరిగణింపబడుతుంది." ఈ ప్రకటనను అనుసరించి ఇంజనీర్లు, టెక్నీషియన్లు, స్పెషలిస్టులు మొదలైనవారందరికీ పరిశ్రమలలోని కూలీలకి మాదిరిగానే శుభ్రమైన తిండి, బట్ట, ఉండడానికి ఇల్లు, విశ్రాంతిగృహాలు శానిటోరియములలోనికి ప్రవేశించేహక్కును ఇస్తూ చట్టం చేయబడింది. వారికి స్వంతగృహాలలోనే పరిశోధనలకంటూ ఒక గది ప్రత్యేకంగా ఈయబడింది. ఆదాయపు పన్నును తగ్గించేరు. పరిశ్రమలలో పనిచేసే కూలీల పిల్లలకి లాగే వీరి సంతానానికి కూడా కాలేజీలలోను-పాఠశాలలలోను, చేరి చదువుకొనేటందుకు అవకాశాలు కలిగించేరు.

చాలామంది ఇంజనీర్లకు జైలుశిక్షలు, ప్రవాసశిక్షలు, రద్దు చేయబడి తిరిగి ఉద్యోగాలలో ప్రవేశపెట్టబడ్డారు. ౧౯౩౨ లో జరిగిన అరస్టులు చాల తక్కువ. కమ్యూనిస్టులు కానివారు కూడా వారివారి సామర్థ్యాన్ని పట్టి పెద్దపెద్ద ఉద్యోగాలలోకి తీసుకోబడ్డారు. ఎంతోమంది

ఇంజనీర్లకు సోవియటురష్యాలో మహాగౌరవప్రదముగా ఎంచబడే Order of Lenin పతకాలు ఈయబడినాయి. అంతవరకు Intelligenteia ప్రభుత్వానికి తమ కష్టసుఖాలను గురించి తెలుపుకొనడానికి భయపడేవారు. ఒకవేళ చెప్పుకున్నా వినేవారు ఉండేవారుకారు. కాని, నేడు అలాగ కాదు. వారు తమకు గల ఇబ్బందు లన్నిటిని ప్రభుత్వానికి చెప్పుకోవచ్చును. ప్రభుత్వంకూడా వారి విషయమై శ్రద్ధపుచ్చుకుంటూంది. పూర్వం ఏ స్పెషలిస్టయినా ఫలానాచోట నూనె పడవచ్చుననే ఊహతో నూతులు త్రవ్వించి కృతార్థుడు కాకపోతే 'మాధనం—శక్తి దుర్వినియోగం చేయదలచుకున్నావా' యని ప్రభుత్వం ఆతణ్ణి బహుకఠినంగా శిక్షించేది. కాని,నేడు (౧౯౩౨) అల్లాంటివి పొరపాట్లక్రింద క్షమించేస్తున్నారు. "పొరపాట్లు ఎవరికైనా ఉంటాయి. అం త మా త్ర ం చే త ఎవ్వరినీ ద్రోహులు అనడం న్యాయంకాదు. అటువంటి పొరపాట్ల వలన అనుభవం కలుగుతుంది. అవి పారిశ్రామికాభివృద్ధికి సాయపడతాయి." అని సర్దుబాటు చేయసాగేరు. ఇటీవల న్యాయశాఖకు కమిస్సారుగా నియమించబడిన "నికోలాయ్ క్రెలింకో" పరిశ్రమల కూలీలకుగల హక్కులు, సౌకర్యాలు, అన్నీ ఇంజనీర్లకు కూడా ఇస్తూ, తగినంత సాక్ష్యం, ఆధారం, లేకుండా అనేకమంది ఇంజనీర్లను అరెస్టుచేశాడని ఒక "ప్రొవిన్షియల్ ప్రాసిక్యూటింగ్ అటార్నీ"ని డిస్మిసుచేసి అరెస్టు చేయించేడు. సోవియటుప్రభుత్వపత్రికయైన 'ఇజ్వెస్టియా'లో 'పివోటల్ సెంట్రల్ కంట్రోలు కమిటీ' సభ్యుడు, మంచి పలుకుబడి కలవాడునగు 'ఆర్నాల్డు సోల్జు' అనే బోల్షెవికు ఈలాగ వ్రాసేడు. "మనుష్యుని విలువ ఎంతో మనం ఇంకా గ్రహించలేదు. పరిశ్రమలలో పెద్దపదవులలో యున్న వారినీ, ఇతరపెద్దఉద్యోగుల్నీ తగినంత సాక్ష్యం లేకుండా శిక్షించడం వలన దేశాభివృద్ధికి గొప్పఆటంకం కలుగుతూంది. సోవియటుశాఖ లన్నీ

టీలోను పనిచేస్తూన్నవారిని శిక్షించి నష్టం కలగచేస్తున్నారు. ఆలాగ శిక్షించబడేవారు తమనిర్దోషిత్వాన్ని ఋజువు పరచుకొనేదాకా ఆలాగ జైలులో ఉండవలసిందే.

౧౨

# 'మెట్రోపికర్స్' ఇంజనీర్ల విచారణ.

౧౯౩౧ జూన్‌నెలలో స్టాలిన్ ప్రకటన ఫలితంగా Intel-ligenteia కు కొన్ని హక్కులు లభించినా అటుతర్వాతకూడ వారిపై అమలు జరపబడిన నిరంకుశవిధానం చూస్తే గంద్రగోళం కలగక మానదు.

౧౯౩౩ జనవరి నెలలో ఒగురు బ్రిటిషుఇంజనీయర్లమీద, ౧౦ మంది రష్యనుఇంజనీయర్లమీద, (వీరిలో ఒక ఆడుది కూడావుంది.) పవరుస్టేషన్లు ధ్వంసం చేయడానికి కుట్రలు చేసినట్లు నేరం మోపి అరెస్టు చేసేరు. బ్రిటిషువారిని అరెస్టుచేసినందుల కై బ్రిటిషురాయబారి తీవ్రంగా అసమ్మతి ప్రకటించి, వారిని ఏవిధమైన విచారణ చేయకుండా వెంటనే విడుదల చేయమని ప్రకటించేడు. కాని, సోవియటుప్రభుత్వం ఏమీ లక్ష్యం చేయకుండా విచారణ ఆరంభించింది. దానిమీద బ్రిటిషు ప్రభుత్వం సోవియటుప్రభుత్వానికి మరల హెచ్చరిక పంపించింది. బ్రిటిషు

ఇంజనీర్లలో ఒక్కరినైనా సరే దోషులుగా నిర్ణయించి శిక్షిస్తే సామ్రా జ్యపు రేవులలో దిగే రష్యానుసరుకు అన్నిటిమీదా పన్నులువేస్తామని బెదిరించేరు. కాని, ఈబెదిరింపు కూడా లెక్కచేయక ముద్దాయీలు ౧౭ గురిలో ౧౬ మందిని దోషులుగా నిర్ణయించేరు. ఒక బ్రిటిషు ఇంజనీరు వదలివేయబడ్డాడు. ముగ్గుర్ని ౫ ఏళ్ళదాకా రష్యాలో అడుగు పెట్టకూడదని తరిమివేశారు. ఒకనికి ౨ ఏళ్ళు, వేరొకనికి 3 ఏళ్ళు, శిక్షలువేసి జైళ్ళలో పారవేశారు. బ్రిటిషుప్రభుత్వం విచారణ వివరాలేమీ తెలుసుకొనకుండానే రష్యానుసరుకులమీద అదనపుపన్ను విధించింది. దీనికి ప్రతిక్రియగా రష్యాకూడ బ్రిటిషుసరుకులమీద అదనపుపన్ను విధించింది. అందుచేత రెండుదేశములమధ్య వర్తకము ఆగిపోయింది. దీనివలన బ్రిటిషుపారిశ్రామికులకు, నౌకాకంపెనీలకు చాల నష్టముకలిగింది. రష్యాకుకూడ కొంతవరకు ఇబ్బందికలిగింది. చిట్టచివరకు రష్యా విదేశాంగమంత్రియైన 'లిట్వినోవ్' ప్రపంచఆర్థికమహాసభకు లండను నగరమునకు వచ్చినపుడు, బ్రిటిషువిదేశాంగమంత్రియైన 'సర్ జాన్ సైమను' 'లిట్వినోవ్'ను కలసికొని, రెండుదేశములమధ్య వర్తకమును మరల పునరుద్ధరించు విషయమై మాట్లాడెను. తుదకు బ్రిటిషుఇంజనీర్లను వదలుటకును, రెండుదేశములు ఒకరిసరుకులమీద మరియొకరు విధించినపన్నులు రద్దుచేయుటకును ఒడంబడిరి. ఇంతటితో రెండుదేశముల మధ్య నున్నవైరములు క్రమక్రమముగా అంతరించెను.

౧౩

# 'కిరోవ్' హత్య

కాని, బ్రిటిషు–రష్యను ఇంజనీర్లను శిక్షించుటతో రష్యాలోని కుట్రలు ఆగిపోలేదు. ఆమరుసటి ఏడాదే ఉద్యోగమునుండి తొలగించ బడిన 'నికోలేవ్' అను నతడు 'కమ్యూనిష్టు–పార్టీ'యొక్క 'లెనిన్‌గ్రాడ్' శాఖకు కార్యదర్శియు 'Polit- bureau' లో సభ్యుడును 1905వ సం॥పు విప్లవమునకు పూర్వమునుండియు పనిచేయుచున్న విప్లవకారుడును, అయిన 'కిరోవ్' అనునతనిని హత్యచేసేడు. వెంటనే సోవియటు ప్రభుత్వం కుట్రదారులను నాశనముచేయుటకు తీవ్రచర్యలను తీసికొంది. మాస్కో, లెనిన్‌గ్రాడ్, కీల్. మిన్స్కు. మొదలైన పట్టణములలో విప్లవవ్యతిరేకులని అనుమానమున్నవారిని 'కిరోవ్' హత్యతో సంబంధ మున్నదని అనుమానమున్నవారిని, మొత్తం ౨౦౦ మందిని అరెస్టు చేసేరు. ఈనిర్బంధితులందరు రష్యా ప్రధానన్యాయస్థానమందలి 'మిలిటరీ కమీషను' చేత విచారింపబడ్డారు. నేరస్థులకు, సాక్ష్యముగాని వ్యక్తి

యేయితరసహాయముగాని తెచ్చుకొను అవకాశము ఈయబడలేదు. 'ఓగ్పూ' విచారణవలెనే వీరివిచారణకూడ అతిరహస్యముగా జరుప బడింది. నేరస్తులలో ౧౦౦ మందికి పైగా మరణదండన విధింపబడింది. ముద్దాయిలకు, అపీలుచేసుకొను అవకాశముకూడ యివ్వలేదు. మరణ దండన విధింపబడ్డవారందరు వెంటనే కాల్చివేయబడ్డారు. సోవియటు ప్రభుత్వంయొక్క ఆజ్ఞమీద, 'కమిసారియట్ ఆఫ్ ఇంటర్నల్ అఫైర్సు' చేత ఈవిచారణలన్నియు జరుపబడ్డాయి. (ఈసం॥రమే ఓగ్పూశాఖ కూడ ఇందులో కలిపివేయబడింది.) ఈకుట్రలతో విదేశీయప్రభుత్వము లకు సంబంధముండుటచేతను, వారితో పేచీపడుటకు సోవియటు ప్రభు త్వమునకు యిష్టములేకపోవుటచేతను, ఈవిచారణ రహస్యముగా జరుప బడింది. జనోవీవ్, కెమెనోవ్, యిన్ను ట్రాట్స్కి పక్షమువారైన సెలుట్స్కి, ఇవ్డొకిమోవ్, సెఫాలోవ్, వార్డిన్, మొదలగువారుకూడ అరెస్టుచేయబడ్డారు. కాని, వారు దోషులని నిర్ధారణచేయుటకు తగినంత సాక్ష్యములేకపోవుటచేత, దేశము నలుమూలలకు బదిలీ చేయబడి 'Commissariat of internal affairs' యొక్క నిఘాలో ఉంచ బడ్డారు. తరువాత వారు చేయు కుట్రలను గురించి తగిన ఆధారము దొరుకుటచేత వారందరు అరెస్టుచేయబడి విచారింపబడ్డారు. విచారణలో వారందరును తమ నేరములను అంగీకరించేరు. కాని, కమ్యూనిస్టు పార్టీమెంబర్లయిన వీరందరు విప్లవమునకు పూర్వము, తరువాత, కూడ దేశమునకు గొప్పసేవచేయుటచేతను, లెనిన్‌తోకూడ వీరు చాలకాలము పనిచేసియుండుటచేతను, ఉరిశిక్షలుమాత్రము విధింపబడలేదు.

ఈ కేసు రహస్యముగా విచారింపబడుటచేత యిందలి నిజానిజ ములను మనము నిర్ణయించలేము. 1933 వ సం॥న బ్రిటిషు-రష్యను ఇంజనీర్లను, 'సొవనార్కొమ్' యొక్కగాని, 'Polit-bureau' యొక్క

గాని, సలహాలేకుండగాని ట్రాస్కీ అరెస్టుచేసి శిక్షించింది. అంతవరకు నిరంకుశముగా ప్రవర్తించిన ట్రాస్కీవాది తాను స్వతంత్రముగా చేసిన విచారణలో 1933 వ సం॥లోని ఇంజనీర్ల విచారణయే కడపటిది. 1934 వ సం॥ను కిరోవ్‌హత్య తరువాత చేయబడిన అరెస్టులు ప్రత్యేకముగా సోవియటుప్రభుత్వముయొక్క సలహామీదనే జరిగేయి. వీరందరిమీద, అనేక తరహాలైన విప్లవవ్యతిరేకచర్యలు చేయుచున్నారని కేసుపెట్టబడింది. కిరోవ్‌హత్య జరుగుటకుపూర్వము అరెస్టుచేయబడిన వారిలో అనేకమందిమీద సోవియటు ప్రభుత్వము ఆజ్ఞలేనిదే రష్యాయందు రహస్యముగా ప్రవేశించిరనియు, ప్రమాదకరమైన ఆయుధములు అవసరములేనిదే దగ్గర ఉంచుకొన్నారనియు, నేరములు మోపబడ్డాయి. చాలాకాలమునుంచి రష్యాలోనే నివసించుచున్న విదేశీయులు కొందరు(వీరిలో లట్వియా'కాన్సల్'గా లెనిన్‌గ్రాడ్‌నందున్న లట్వియాదేశస్థుడొకడు ) కూడ సోవియటురష్యాలో ముఖ్యులైన బోల్షివికులను చంపుటకు కుట్రలు పన్నుచుండిరనియు కిరోవ్‌హత్య అట్టివాటిలో మొదటిదనియు, నేరములు మోపబడెను. రహస్యముగా రష్యాప్రవేశించిరనియు, కిరోవును హత్యచేయుటలో సంబంధము కలిగియున్నారనియు, నేరములు మోపబడినవారితో, స్టాలిన్‌కు వ్యతిరేకులైన జినొవీవ్, కెమెనోవ్ మొదలైన వారిని కూడ కలిపి రహస్యముగా విచారణచేయుటచేత కొంతవరకు అనుమానమునకు తావిచ్చింది.*

---

* లెనిన్‌గ్రాడ్ నగరమున కుట్రచేసి కిరోవ్‌ను చంపిరని అరెస్టు చేయబడిన వారిపై 'నేరారోపణపత్రము' 1935 వ సం॥ జనవరి 5 వ తారీఖున వెలువడిన 'International Press Correspondence' అను పత్రికలో ప్రకటించబడింది. రష్యనుజాతీయవాదులవల్ల ప్రకటింపబడుచున్న 'Za Rossiyu' అను పత్రికయొక్క నవంబరుమాసపు సంచి

సాధారణముగా సోవియటుప్రభుత్వము రాజకీయనేరస్థులను రహస్యముగా విచారించి శిక్షలు వేస్తూంటుంది. అందుచేత ప్రపంచమంతయు దీనిలో యేదో మోసము, అన్యాయము, ఉన్నదని అనేకవిధాలుగా అనుకుంటారు. ఒక్కనిని చంపినందులకు దేశమునందు నలుమూలల అనేకవందలమందిని అరెస్టుచేసి, రహస్యముగా విచారణ చేయుట, ఇటువంటి అనుమానములకు కారణంఅవుతూంది. * ఇట్లు రహస్యముగా విచారింపబడ్డవారందరు నిజముగా దోషులైనప్పటికి, పైవారికి

---

కలో 'తగిన కాలములో నుండుటకలన స్టాలిన్‌ను చంపుటకు వీలులేదనియు, లెనిన్‌గ్రాడ్‌లో కిరోవ్‌ను, మాస్కోలో 'కగానొవిచ్'ను చంపివేయ' మనియు వ్రాయబడినట్లు కూడ 'ఇంటర్ నేషనల్ ప్రెస్ కరస్పాండెన్సు' అను పత్రికలో వ్రాయబడెను. రష్యనుప్రవాసుల యితర పత్రికలు కూడ ఈవిషయమై హెచ్చరికలు చేసేయి. 'లూయిస్ ఫిషర్' ఈవ్యాసములను రష్యనుప్రవాసులపత్రికలలో తాను చూచినట్లు 'న్యూయార్కు' నందలి 'నేషన్' అను పత్రికలో 1935 సం॥ మే 8-15 తేదీలలో వ్రాసియున్నాడు.

* ఇటువంటి నిర్బంధవిధానమునకు అసమ్మతి తెలుపుటకు 'Labour Party' యొక్క ఎగ్జిక్యూటివ్ కమిటీ, లండనులోని సోవియట్ రష్యా రాయబారివద్దకు రాయబారము పంపించింది. సోవియటురాయబారి 'ఇవాన్' మెయిస్కీ' వారిని, తగునట్లు గౌరవించి, ఆకేసుయొక్క వివరములున్ను, సుప్రీమ్ కోర్టు యొక్క జడ్జిమెంటున్ను అందజేసేడు. వారికి మెయిస్కీ ఈవిధంగా చెప్పేడు. "కిరోవ్ హత్యసంబంధములో అరస్టు చేయబడిన వారందరును ద్రోహులని నిరూపించుటకు తగినసాక్ష్యము మాదగ్గరఉంది. వీరిలో చాలమంది, రివాల్వర్లు, బాంబులు, మొదలైన ప్రమాదకరమైన ఆయుధములతో రష్యా రహస్యముగా ప్రవేశించేరు.

ఆవిషయములన్నియు తెలియకపోవుటచేత, ప్రభుత్వముయొక్క పరిపాలనావిధానమునకు వ్యతిరేకులనందరను ప్రభుత్వము ఈవిధంగా అణచివేస్తూందని పైవారు అనుకుంటారు. సోవియటుప్రభుత్వము అందరిని భయపెట్టి తమ కార్యనిర్వహణం చేసుకొనుచున్నదని యితరులు అనుకుంటారు. 'ఇంటెలిజన్షియా' వర్గములో ఇది యెటువంటి భావములను కలిగిస్తూందో మనం గమనించాలి. 1931 వ సం॥లో స్టాలిన్ చేసిన ప్రకటనను త్రోసిపుచ్చి, మరల యిట్టి తీవ్రశిక్షలను విధించుట చూడగా ప్రభుత్వము పైకి మంచిమాటలు చెప్పి, తన పూర్వపు విధానమునే అనుసరించుచున్నదని అనుకుంటున్నారు. కాని, అది నిజము కాదు. ఎందుచేతనంటే 1934 సం॥ జూలై నెలలో ప్రభుత్వపు డిప్యూటీ

---

కోర్టులో వారు అందరు తాము సోవియటుప్రభుత్వమునకు శత్రువులనియు, తమమీద మోపబడిన నేరములలో అసత్యమెంతమాత్రము లేదనియు బహిరంగముగా అంగీకరించేరు. కిరోవ్ హత్యకు పూర్వము అరెస్టుచేయబడిన కుట్రదారులను వేర్వేరుస్థలములందు విచారించి శిక్షించేరు. కాని, కిరోవ్ హత్య జరిగినతరువాత ఇటువంటి హంతకులను తీవ్రముగా శిక్షించవలసి వచ్చింది. ఇటువంటి హంతకులసంఘములు యూరపుఖండమంతటను వ్యాపించి యున్నాయి. యుగోస్లావియా రాజు, ఫ్రెంచివిదేశాంగమంత్రి మొదలైన వారియొక్క హత్యలకు ఈసంఘస్థులే కారణము. కొన్ని యూరపుదేశములలో వీరు ప్రభుత్వఆదరమునుపొంది, ఇటువంటి హత్యలు చేయుటకు వినియోగింపబడుతూన్నారు. రష్యాసరిహద్దులలో యెంతకాపలా ఉంచినప్పటికి ఈహంతకులు రహస్యముగా ప్రవేశించి రష్యనుప్రభుత్వోద్యోగులను చంపుటకు ప్రయత్నములు చేస్తూన్నారు. అటువంటివారిని కఠినముగా శిక్షించకుండా చేతకానివారివలె చూస్తూ ఊరకుండుట అసంభవము"

ప్రోసిక్యూటరైన విషిన్స్కీ. తన క్రిందపనిచేయు స్థానికప్రోసిక్యూటర్లకు "కార్యనిర్వహణములో వచ్చులోటుపాట్లకు ఆయాసంస్థలలో పనిజేయు డైరక్టర్లు, ఇంజనీర్లు, మొదలైనవారిని బాధ్యులుగా చేయుట చాల తెలివితక్కువపని" యని తెలియచేసేడు. అంతేకాకుండా యుక్తాయుక్త వివేకజ్ఞానం లేకుండా ప్రాసిక్యూటు చేయుటను తీవ్రముగా ఖండించేడు. ఇటీవల సైబీరియన్ న్యాయస్థానములచేత విధింపబడిన అనేక శిక్షలను రద్దుచేయుటయేగాక, యిక ముందట్టి అన్యాయములు జరుగరాదని కఠినముగా మందలించేడు.

౧౪

# 'కులక్'లను తొలగించుట.

౧౯౨౮—౩౪ సం॥ల మధ్య Intelligenteia ను ఏవిధంగా అణచివేశారో అదేవిధంగా అదేకాలంలో కులకులను కూడా నాశనం చేయడానికై సోవియటుప్రభుత్వం కఠినచర్యలను అవలంబించింది. ఇంత క్రితం కమ్యూనిస్టుపార్టీ ఆహారపదార్థాలను సమృద్ధిగా ఉత్పత్తిచేయడానికై ఏయే విధానాలను అవలంబించేరో మనం పైన చర్చించేము. రష్యను కమ్యూనిస్టులు ౨ సంవత్సరాలపాటు ఈకులకుల విషయంలో తర్జనభర్జనలు చేశారు. పత్రికలలోను, అనేకవేదికలమీద చర్చించేరు. పార్టీలోనే భేదాభిప్రాయాలేర్పడ్డాయి. చిట్టచివరకు పార్టీలోని అధిక సంఖ్యాకులచేత ఒకవిధానం తయారుచేయబడి ఆమోదించబడింది. దానికి కొంతమంది అంగీకరించక కుట్రలు సాగించేరు. ఆకారణంచేత ప్రభుత్వం వారిని దేశంలోంచి తరిమివేసింది. కొందరను ప్రవాసానికి పంపేసింది. కాని, ఈ అధికసంఖ్యాకులు తయారుచేసిన విధానంవలన

౧౯౧౭–౧౮ లలో కలిగినవిప్లవంకంటె పెద్దవిప్లవం రైతులలో కలిగింది. కొన్నికోట్లమంది రైతులచేత వేరువేరుగా వ్యవసాయం చేయబడుతూన్న భూమిని కొద్దిలక్షల సంఖ్యగల పెద్దపెద్ద సమిష్టిక్షేత్రాలుగా మార్చి యంత్రసహాయాన వ్యవసాయం సాగిస్తే అన్నిపంటలు పూర్వంకంటె హెచ్చుగా, విరివిగా, పండించవచ్చుననీ నాడు దేశంలో కరువులబాధ తొలగుతుందనీ, ప్రస్తుతవిధానంలో తమ దైనికావసరాలకు కూడా సరిపడేటంత పంట పండించుకొనలేకుండా వున్న రైతుకు దరిద్రబాధ తొలగిపోతుందనీ, యుద్ధసమయాలలో ఉపయోగించుకొనడానికై అవసరమైన వస్తువుల్ని నిలువకూడా చేసికోవచ్చుననీ, కమ్యూనిస్టులు ఊహించేరు.

౧౯౧౮ లో జర్మనీతో 'బ్రెస్టులిటోవిస్కు సంధి' చేసుకొనడానికి నిర్ణయించడం కమ్యూనిస్టుపార్టీచేసిన మహత్తరనిర్ణయాలలో ఒకటి. వ్యవసాయాన్ని చిన్నరైతులచేతినుండి తొలగించి పెద్దపెద్దసమిష్టికృషి క్షేత్రాలలోనికి పోగుచేయవలెననే నిశ్చయం కూడా అంతమహత్తరమైనదే. 'బ్రెస్టు' సంధి తరువాత ఇంతగడ్డుసమస్య ఎన్నడూ కలుగలేదు. దీనిలోనే రష్యాలోని ధనికవర్గానికి చెందిన కులకులను నిర్మూలించడంకూడా ఇమిడివుంది. రష్యాలోని ౨,౫౦,౦౦,౦౦౦ మంది రైతుల్ని మూడుతరగతులుగా విభజింపవచ్చును. ౧. బీదరైతు (బెడ్నియాకీ) ౨. మధ్యతరగతిరైతు (సెరిడ్నియాకీ) ౩. ధనికుడగురైతు (కులకీ) తమ చిన్నచిన్న కమతాలలో వచ్చేది స్వల్పం కావడంచేత సామాన్యంగా బీదరైతులంతా సమిష్టికృషిక్షేత్రాలలోనికి (కోల్ఖోజ్) చులకనగానే చేరుతారు. సమిష్టివ్యవసాయంలోని లాభాలను గూర్చి వివరంగా చెప్పి ప్రచారంచేస్తే మధ్యరకపురైతులుకూడా చాలామంది చేరుతారు. కాని, వారిలోని దురాశాపరులు, శ్రమపడి ఎక్కువ పండించుకోగలవారు వీరిలో

చేరడానికి అంగీకరించరు. ఇంక భూముల్ని అమరకం ఇచ్చుకొనీ, వడ్డీ—వ్యాపారం చేసుకొని జాకీదార్ల ఆస్తుల స్వాధీనం చేసుకొనీ, కొలవ రేటీవుల ఉపయోగంలోకి తెచ్చుకొని బాగాలాభాలు గడించీ, తక్కువ కూలికి మనుష్యుల్ని కుదుర్చుకొని ఎక్కువ చేయించుకొనీ, ధనవంతులయ్యే కులకులకు ఈవిధానం బొత్తిగా కిట్టదు. అందుచేత సమాజంలోనుంచి ఈవర్గాన్నే తొలగించివేయాలి. వ్యవసాయంలోకూడా గొప్ప మార్పు తీసుకొనిరావాలంటే సుమారు పదిలక్షలమంది కులకుల్ని నాశనం చేయాలి. * ప్రజాసామాన్యంయొక్క క్షేమాభివృద్ధులకోసం ఇంత కష్టతరకార్యాన్ని సాధించపూనిన బోల్షివికులకు తమవిధానమందు ఎంతనమ్మకం—పట్టుదల ఉందో తెలుస్తుంది. వ్యవసాయం వలన ఉత్పత్తిని హెచ్చించాలంటే భూమిని ప్రత్యేకవ్యక్తుల చేతులనుండి తొలగించాలి. వ్యవసాయంలోకూడా యంత్రాలు ప్రవేశపెట్టబడాలంటే భూమి చిన్నచిన్న ఖండాలుగా వుండకూడదు. అవన్నీ కలిపివేయబడాలి. ఆ కలిపి వేయబడిన పెద్దపెద్ద భూఖండాలకి మధ్య ప్రత్యేకవ్యక్తుల భూములు అడ్డంగా వుండకూడదు. ఒకసమిష్టివ్యవసాయక్షేత్రం ఏర్పరచాలంటే కొన్నివందల ఎకరాలు భూమి ఏకంచేయాలి. ఈఏకఖండంలో మధ్య మధ్య సమిష్టిక్షేత్రంలో చేరడానికి ఇష్టంలేనివారి భూములుంటే వాటిని

* దేశం మొత్తం మీద చూస్తే కులకులసంఖ్య చాలా ఎక్కువగానే వుంది. ౧౯౨౫లో స్టెప్నిక్ ఈవిధంగా వ్రాసేడు. "ప్రతిగ్రామంలోను సాధారణంగా ముగ్గురు-నలుగురు కులకులు, వారికంటె తక్కువ తరగతి వారయినా అటువంటిగుణాలే గల ఇంకో ఆరు-ఏడుగురు ఉన్నారు. వారేవిధంగాను శ్రమకాని, నేర్పుకాని, అవసరంలేకుండానే ఇతరుల్ని అనేకవిధాల మోసంచేసి, బాధపెట్టి, తమ సంపద నభివృద్ధి చేసుకుంటారు."

బలవంతంగా ఆక్రమించుకొని సమిష్టిక్షేత్రాలకి కలిపివేయాలి. ఈవిష యాలు నిర్ణయించడంలో కమ్యూనిస్టుపార్టీ ఏకీభావమే చూపింది. ఏవిష యంలోనైనా అభిప్రాయాలు భేదంగా వుండొచ్చు గాని, కులకుల్ని నిర్మూ లించడంలో కమ్యూనిస్టులందరిదీ ఒకే అభిప్రాయం.

రష్యనుప్రజాసామాన్యం కులకులయెడ చూపించే క్రోధానికి, అస హ్యానికి హద్దు వుండదు. సాధారణంగా దూరంవాళ్ళకి కులకుల్ని నిర్మూ లించడం అనే మాట వినపడగానే నేర్పరులు, శ్రమపడి పనిచేసేవారు, బుద్ధిశాలురు, స్వప్రయోజకతచే ధనం సంపాదించి క్రమంగా ధనికులయిన వారు అగుపెద్దరైతుల్ని నిర్మూలించి, సోమరిపోతుల్నీ, మూర్ఖుల్నీ, అట్టే వుంచుతున్నారనిపిస్తుంది. కులకులంటే బీదప్రజల్ని నాశనం చేసి వారి రక్తమాంసాలు పీల్చి—హరించే నరరూపరాక్షసులని రష్యనులు తలుస్తారు. ౧౮౯౯లో స్టెప్నిక్ అనే యాతడు ఈకులకులు ప్రజాసామాన్యాన్ని ఏవిధంగా అణగతొక్కి బానిసలుగా ఉపయోగించుకుంటారో వర్ణించేడు. "కులకులు నిరక్షరకుక్షిలు. మూర్ఖులు. అయితేనేం, ఇతరుల దగ్గరనుంచి ఏవిధంగా డబ్బులాగాలో వారికి బాగా తెలుసును. జలగలమాదిరిగా తమ చుట్టుప్రక్కల గలప్రజలనుండి అనేకవిధాలుగా డబ్బుహరించి క్రమంగా ధనికులై ఇతరుల్ని తమకు బానిసలనుగా చేసుకుంటారు. ఇదే వారి ముఖ్యవృత్తి." ఒక జర్మనుదేశీయుడు ఈవిధంగా వ్రాసేడు. "రష్యను గ్రామసీమలలోని జనం అందరిలోకీ కులకుల సంగతి కొంచెం వినతగి నదే. రైతులవద్దనుంచి వీరు ధనం లాగే ఉపాయాలు చాలా భయం కరంగాను, క్రూరంగాను, నీచంగాను కనిపిస్తాయి. చాలాహెచ్చువడ్డీ మీద రైతులకు అప్పులు ఈయడం. అసలు-వడ్డీలు ఆస్తికి సరిపడేదాకా చల్లగా ఊరుకొని వారిభూములన్నీ స్వాధీనం చేసికొనడం. నిరాధారు లైన ఆరైతుల్ని వీలయినంత తక్కువ కూలిని ఇచ్చియో, లేకుంటే

అత్యవసరసమయంలో కొద్దిగా అప్పునిచ్చి అది తీర్చేదాకా వారిచేత వెట్టి చాకిరీ చేయించికొనియో వారిని బానిసలను చేసేస్తారు. కులకులు బీద రైతుల పాలిట నరరూపరాక్షసులు." ౧౯౧౦లో Dr. డిల్లన్ ఈవిధంగా వ్రాసేడు. "కులకులంటే ఏకోశాన్నీ దయాదాక్షిణ్యాలు లేనివాడన్నమాట. నేను ప్రపంచం అంతా తిరిగేను. అనేకమందిని చూసేను. కాని, నాకెక్కడా ఇంతక్రూరులు, ఇటువంటి నరరూపరాక్షసులు, వీరుతప్ప మరెవ్వరూ కనిపించలేదు." ఈవిధంగా రష్యనులేమిటి?—విదేశీయులేమిటి?—అంతా ఈకులకులకంటె క్రూరులు ఉండరంటారు. కాని, పెట్టుబడిదారులదృష్ట్యా చూస్తే ఈవర్గం తమ స్వార్థంకోసమే పాటుపడ్డారని చెప్పవలసి వస్తుంది. ధనికవర్గం చేసినట్లే కూలికి దేవులాడేవారిని మిక్కిలి తక్కువ కూలికి నియమించుకొనీ, అప్పుకావలసినవారికి హెచ్చువడ్డీలకు అప్పుల నిచ్చీ, అన్నివస్తువులూ బేరంచేసి తక్కువ ధరలకు కొని వాటినే హెచ్చుధరలకు అమ్ముకొనీ, ఆర్థికముగా హీనస్థితిలో నున్నవారిని నాశనంచేసి తమరు వృద్ధి పొందుతూంటారు.

ఈకులకులు మంచివాళ్ళు అయినాసరే, చెడ్డవాళ్లు అయినాసరే, కమ్యూనిస్టుపార్టీకి వారి మంచిచెడ్డలతో నిమిత్తంలేదు. వారు రైతులలోనుండికూడా ధనికవర్గాన్ని ఏరివేయ దలచుకున్నారు. సమిష్టిక్షేత్రాలలో చేరేవారికి పన్నులు తగ్గించీ, వ్యవసాయపు ఖర్చులకోసం వడ్డీలేకుండా చిన్నచిన్న వాయిదాలమీద తీర్చే పద్ధతిమీద అప్పులనిచ్చీ, ఇంకా ఎన్ని సౌకర్యాలు కలిగించినా ౧౯౨౧—౨౮లమధ్య నూటికి ఇద్దరుకంటె ఎక్కువమంది వ్యవసాయక్షేత్రాలలో కలియలేదు. అందుచేత వారిని సమిష్టిక్షేత్రాలలో చేర్చడానికై కమ్యూనిస్టులు తీవ్రచర్యలు తీసుకొనవలసి వచ్చింది. వ్యవసాయం విషయంలో ప్రభుత్వము యొక్క నీతినిగూర్చి 'స్టాలిన్' ప్రకటించిన కొద్దిమాసాలలోనే గొప్పవిప్లవం జరిగిపోయింది.

సమిష్టిక్షేత్రాలలో చేరక మధ్యను అడ్డుగా యున్నవారి భూములన్నిటినీ స్వాధీనం చేసుకొని వారిని కట్టుబట్టలతో ఊళ్ళలోనుంచి తరిమివేశారు, సమిష్టిక్షేత్రాలలో చేరనివారి భూములమీద హెచ్చుపన్నులు విధించేరు.

కొద్దినెలలలోనే ప్రభుత్వపు టంచనాలన్నీ వెనుకబడిపోయినాయి. మొదటి పంచవర్షప్రణాళికలో ఒక్కొక్క ఏడాదిలో నూటికి ౨౦వంతుల చొప్పున అయిదేళ్ళనాటికి రైతులందర్నీ సమిష్టిక్షేత్రాలలోకి ఆకర్షించాలని నిర్ణయించబడింది. కాని, ప్రభుత్వముయొక్క తీవ్రవిధానం కారణంగా మొదటిఏడాది పూర్తి అయ్యేటంతకే నూటికి ౫౫ గురి వరకు కలసిపోయారు. ఒక్కసారిగా దేశం అంతటా సమిష్టిక్షేత్రాలు విజృంభించడం వలన ప్రభుత్వం వాటి అన్నిటికీ సరిపడేలాగ ట్రాక్టర్లనీ, యంత్రాలనీ, సరఫరా చేయలేకపోయింది. దానితో సమిష్టిక్షేత్రాలలో చేరిన రైతులలో అసంతృప్తి బయలుదేరింది. ఈఅశాంతిని చల్లార్చకపోతే ప్ర మా ద ం తటస్థిస్తుందని "సెంట్రలు ఎగ్జిక్యూటివు కమిటీ" కమ్యూనిస్టుపార్టీకి రిపోర్టు చేసింది. కమ్యూనిస్టు పార్టీయొక్క సెంట్రల్—కమిటీ యొక్క అనుజ్ఞతో 'స్టాలిన్' "విజయోన్మాదం" అంటూ దేశానికి ఒకసందేశం ఇచ్చేడు. ఆఉపన్యాసంలో స్థానికకమ్యూనిస్టు సంఘాలలోని సభ్యులు కొందరు పడిన తొందరపాటును విమర్శించేడు. ప్రతి రైతు తనకు ఇష్టం వుంటేనే సమిష్టికృషిక్షేత్రాలలో చేరవచ్చుననీ, ఇష్టం లేనివారు కొన్నిషరతులకు లోబడి మానుకోవచ్చుననీ, ఎంతెంత ఆస్తులతో వచ్చి చేరినా సమిష్టికృషిక్షేత్రసభ్యులు తమ ఆస్తిఫలాన్ని అనుభవించవచ్చుననీ ఆతడు ప్రకటించేడు. ఈప్రకటనమును చూసి అదివరకు సమిష్టిక్షేత్రాలలో చేరినవారిలో సగంమంది తప్పుకున్నారు. ఆంతటినుంచీ, ఒడిదుడుకులు లేకుండా నిదానంగా సమిష్టికృషినిర్మాణం సాగింది. నెమ్మదినెమ్మదిగా ౧౯౩౩ నాటికి దేశంలో నూటికి ౬౫

మంది రైతులభూములు ౨,౦౦,౦౦౦, కృషిక్షేత్రాలలోనికి తీసుకోబడినాయి. దేశము మొత్తప్రపంటలో మూడువంతులు ఈసమిష్టిక్షేత్రాలలో పండించబడింది.

లక్షలకొలదీయున్న ఆకులకుల్ని ఏవిధంగా తొలగించేరో, ఎందర్ని రూపుమాపేరో ఆవివరాలేమీ తెలియవు. సమిష్టివ్యవసాయక్షేత్రా లంటేనే మండిపడే ఈకులకులు ఎందరు ఆస్తులు లాగివేయబడి దూరదేశాలకి తరిమివేయబడ్డారో తెలియదు. ఆస్తులు లాగివేయబడి ఊళ్ళలోనుంచి తరిమివేయబడిన వారంతా కులకు లగుదురో—కాదో—కూడా తెలియదు. వీరిలో ఎంతమంది జైళ్ళలో పడినారో, ఎంతమంది ఉత్తరప్రాంతాల యందలి అడవులలోని సెటిల్మెంటులలో త్రోసివేయబడ్డారో, ఎంతమంది రైలుబాటలు వేయడానికి, కాలువలు త్రవ్వడానికి, పంపబడ్డారో, ఎవ్వరికీ తెలియదు. వారిలో కొంతమంది కూలీలు చాలక నానాఅవస్థలు పడుతూన్న "మెగ్నాటిగోరస్కు" "ఛేలాబిన్స్కు" నగరాలకి పంపబడికూడ ఉండవచ్చును. "డానెట్జిబేసిన్" బొగ్గుగనులకి కొంతమందిని పంపిఉంటారు. లక్షలకొలదిఉండే ఈకులకులు ఆలుబిడ్డలతో ఎక్కడ, ఎటువంటి కష్టాలు పడుతున్నారో మనకేమీ తెలియదు. వారిని, వారికుటుంబాలని, ఏమిచేసిందో సోవియటుప్రభుత్వం బయటి ప్రపంచానికి ఎరుకపడనీయలేదు. కాని, రష్యాలో ప్రయాణం చేసే విదేశీయాత్రికులందరూ దక్షిణరష్యా అంతటా రైలుస్టేషనులలో గుంపులు గుంపులుగా పడియున్న స్త్రీలనీ—పురుషుల్నీ చాలా కొద్దిమూటలతో, దైన్యం ఓడుతూన్న ముఖాలతో, పోలీసుకాపలాల మధ్య రైళ్ళెక్కించబడుతూండగా ఈఅయిదారేళ్ళనుంచీ చూస్తూనే ఉన్నారు. ఈవిధంగా ఎన్నిలక్షలమంది ఎంతబాధలుపడ్డారో ఎవ్వరికి తెలుసును.*

* రష్యాఅంతా చూసివచ్చిన ఒకవిదేశీయుడు వ్రాసిన వ్రాతలు

ఈకులకులను నాశనం చేసిన విధానం చాలా చిత్రంగా ఉ ం టు ం ది. U. S. S. R. లోని "సోవనార్కమ్" కులకులందర్నీ తొలగించాలని ఒక ప్రకటన చేసింది. దేశంలో అన్నిచోట్లా భూమిలేనిరైతులు, (బేట్రకీ) బీదరైతులు. (బెడ్నియాకీ) తమతమ గ్రామాలలో సభలు చేసి ఫలానా ఫలానావాడు కులకు అనీ, వారికిగల భూములు, ఇతర

---

గమనించండి. "శ్రమజీవులయి బ్రతుకుతూ వుండే ఇద్దరు రష్యను రైతుల్ని నేనెరుగుదును. వారు. కులకులు కారు ఏకారణమూ కూడా లేకుండానే వారు ఒకరోజురాత్రి ౨ గంటలవేళ ఏవిధమైన నేరమూ చేయకపోయినా నిర్బంధించబడి ఎక్కడనో దూరంగా వున్న ఒక లేబరు క్యాంపుకు తీసుకొని పోబడ్డారు. వారి ఆస్తినంతనూ ప్రభుత్వం వశ పరచుకుంది. వారి కుటుంబాలు నిరాధారులుగా విడిచివేయబడినారు. ఆగ్రామములో అంతా సమిష్టిక్షేత్రములలోకి చేర్చుకోబడ్డారు. కాని, వీరిని మాత్రం చేర్చుకోలేదు. వీరు ధనికరైతులు. కూలీలను పెట్టుకొని వ్యవసాయం చేస్తున్నారు. అందుచేత సమిష్టిక్షేత్రపు యజమాని వీరిని చేర్చుకోనడానికి అంగీకరించలేదు...............

౧౯౩౨ లో జనవరి నెలలో 'ఛెలాబిన్స్క' అనేచోట నున్న కులకుల్ని పైయాత్రికుడే ఈవిధంగా వర్ణించేడు. "మెగ్నిటోస్ట్రాయి" అనే చోటికి కూలీలను తీసుకొనిపోతూన్న చోటికి వెళ్ళేను. వీరిలో చాలమంది ఆస్తులు లాగుకొనబడి జన్మభూమినుంచి తరుమబడిన కులకులే. వీరితో వీరి కుటుంబాలుకూడా ఉన్నాయి. ౧౯౧౫ లో మాస్కోకు పారివచ్చిన పోలిషుశరణాగతుల వలెనే ఉన్నారు. వీరిలోని ముసలివాళ్ళంతా నోరువిప్పితే ఏప్రమాదపాటుమాట వస్తుందో నని మాటలాడలేదు. ఇద్దరుపిల్లలు నాదగ్గరికి వచ్చి సహాయం కోరుతూ తమ దీన గాధలు చెప్పేరు."

ఆస్తులు, ప్రభుత్వం వశపరచుకోవాలనీ, తీర్మానం ప్రతిపాదించి అధికసంఖ్యాకుల సమ్మతులప్రకారం రాశ్యరూపంలో పెడుతూవుండే వారు. ఒక అమెరికను జర్నలిస్టు గ్రామ సభ ల లో ఈతీర్మానాలు ఏవిధంగా ప్రజానుమోదం పొందేవో పైయధికారులు వారి తొందర పాటును ఏవిధంగా సర్దుబాటు చేసేవారో వివరంగా వ్రాసేడు. ఈగ్రామ సభల తీర్మానాలను ఏవిధంగా అమలుపరచేవారో తెలుసుకొనడానికి మనకి ఆధారాలేమీలేవు. రష్యను నవలా నిర్మాతలలో సుప్రసిద్ధుడగు మైకేల్— సోలోఖోవ్ వ్రాసిన "బీళ్లదున్నేరు" (Virgin soil upturned.) అనేనవలలో ఆతని అనుభవాలు వ్రాసేడు. అది ఈక్రింద ఎత్తి వ్రాస్తున్నా. అంతమాత్రంచేత అది సాక్ష్యంగా తీసుకో పనిలేదు. కేవలం వారిని ఏవిధంగా లాగివేశారో అదృశ్యం ఊహించుకొన డానికి అవకాశాలు కల్పించడానికే ఇది ఎత్తి వ్రాస్తున్నా.

* * * * *

"టిమోథీ అచ్చంగా తల్లిపోలికే. మంచి అందమైనవాడు. కొంచెం పొడగరి. ఆతడు మూతితుడుచుకుంటూ భోజనపు బల్లదగ్గర నుంచి లేచాడు."

"ఈవేళ పెద్దలంతా మాయింటికి వచ్చేరు ? దయచేయండి." అంటూ ఆతడు అక్కడ పడివున్న కుర్చీకేసి చేయివిసిరేడు.

"అబ్బే ! కూర్చోడానికి తీరుబడి ఎక్కడ ?"

ఆంద్రీ తనచేతిలోని కాగితాల కట్టలోనుంచి ఒకకాగితం పైకి లాగేడు.

"ఫ్రోల్ డెమాస్కోవ్ ! మొన్న ఈఊరిలోని పేదరైతులంతా సమావేశం అయ్యేరు. అచ్చట మీతాలూకు స్థిర—చరాస్తులన్నీ స్వాధీనం చేసుకొని మిమ్మల్ని గ్రామంలోనుంచి పంపివేయమని తీర్మానిం

చడం అయింది. కనుక మీరు త్వరగా మీభోజనం ముగించుకొని వెళ్ళిపోండి. ఈలోపుగా ఆస్తిజాబితా తయారుచేస్తా."

"ఏమిటి ? ఎందుకు ?"

ఫ్రోల్ తనచేతిలోని చంచా క్రిందపడేసి లేచినిలుచున్నాడు.

"మీ భూస్వాములందర్నీ తొలగించదలచుకున్నాం."

అన్నాడు. దిమ్కా—ఉషకోవ్. తోలుతో మణవబడిన ఫెల్టు బూట్లు టకటక చప్పుడుచేస్తూ ఫ్రోల్ మరోగదిలోకి వెళ్ళేడు. చేతిలో ఒక కాగితం పట్టుకొని వెంటనే తిరిగివచ్చేడు.

"ఇదిగో నా సర్టిఫికెటు. రజ్మీటనోవ్ ! నువ్వు స్వయంగానే దీనిమీద దస్కతు చేశావు."

"ఏమిటా సర్టిఫికెటు ?"

"నే నివ్వవలసినధాన్యం అంతా ప్రభుత్వానికి ముట్టినట్లు."

"నీధాన్యపు సర్టిఫికెటుకీ, దీనికీ సంబంధం లేదు."

"అయితే నా ఆస్తి స్వాధీనం చేసుకొని నన్ను ఇంట్లోనుంచి గెంటివేయవలసిన కారణం ఏమిటి ?"

"ఈగ్రామములోని బీదరైతులంతా ఆలాగ నిశ్చయించేరు. ఆమాట మొదటనే చెప్పేను."

"అల్లాచేయమని ఎక్కడా శాసనం లేదు. ఇది పట్టపగటి బందిపోటు. స్వయంగా జిల్లా ఎగ్జిక్యూటివు కమిటీకి పోయి చెప్పుకుంటా. నాన్నా ! ఏది జీనెక్కడుంది ?"

అన్నాడు టిమోఫీ. ఆండ్రీ అక్కడవున్న బల్ల అంచున ఆని కూర్చుని కాగితం—పెన్సిలు తీసేడు.

"నువ్వు జిల్లా ఎక్జిక్యూటివు కమిటీకి పోదలచుకుంటే నడిచి వెళ్ళవచ్చును. నేను మాత్రం గుర్రాన్ని ఇయ్యను."

కోపంచేత ఫ్రోల్ శరీరం వణకసాగింది. ముక్కు అదిరేయి. హఠాత్తుగా నిలుచున్నచోటనే కూలబడిపోయేడు. తడబడుతూన్న నాలికతో నోరు సవరించుకున్నాడు.

"కుక్కల కొడుకులు, దొంగలు, తడిగుడ్డలతో గొంతుక కోసే రకం, ద్రోహులు." అని మూలిగేడు.

"నాన్నా! లే. చేపుడంటూ ఉన్నాడు. లేకపోలేదు."

ఏడుస్తూ ఆతని కూతురు జబ్బపట్టుకొని ఫ్రోలును లేవదీసింది. అతడూ కొంచెం స్థిమితపడి బల్లమీద పడుకొని రజ్మిటనోవ్, ఉషకోవ్, ఇగ్నెటినోవుల, సంభాషణ వినసాగేడు.

"ఒక ఇనపమంచం, మూడు తలగడాలు, రెండు కంబళ్ళు."

"రెండు పట్టిమంచాలు."

"వంట సామగ్రితోనున్న 'కప్‌బోర్డు' వకటి.—ఏమిటి? ఆసలుకు కూడా చెప్పాలా? అఘోరించినట్లేవుంది."

"పన్నెండు కుర్చీలు. ఒకసోఫా."

"తొక్కుడు హార్మోనియం ఒకటి."

"నా హార్మోనియం మాత్రం నేనివ్వను."

అంటూ డెమ్కా దగ్గరదగ్గరనుంచి టిమోథీ చెల్లెలు లాక్కుంది.

"వొదులు. గుడ్డిపీనుగ! ఒదలకపోతే ముక్కు చితక్కొడతా.

* * * *

"కామ్రేడ్ జఖరింకో! (ఓగ్పూశాఖకి జిల్లాప్రతినిధి.) మోసగాడు, విద్రోహి, కులకు, అయిన 'బోరోడిన్ ట్రిట్ కాన్స్టాంటినోవిచ్' అనే ఇతగానిని మీ స్వాధీనం చేస్తున్నా. ఈతని యింటికి పోయి ఆస్తిని స్వాధీనం చేసుకుంటూ వుండగా, ప్రభుత్వంచేత ఇక్కడికి పంపబడిన కామ్రేడ్ దావీదోవ్ నెత్తిమీద ఇనుపకడ్డీతో రెండుమార్లు

కొట్టీ ఆతనిని చంపడానికి ప్రయత్నించేడు."

"అంతేకాదు. ఇతనివద్ద రష్యనుమోడలు రైఫిలు ఒకటి చూశాను. ఆసమయంలో మేమిద్దరం ఒకకొండవారనే నడిచివస్తున్నాం. అప్పుడే లాక్కుందుకు ప్రయత్నిస్తే పరిస్థితులేలాగ పరిణమిస్తాయో అనీ, తర్వాత తీసుకోవచ్చుననీ, ఊహించి ఊరకున్నాను. కాని, దోవలో ఎక్కడనోగాని నాకంట పడకుండా దానిని దాచివేశాడు. అది దొరికినాక దానిని సాక్ష్యం కోసం మీయెదుట దాఖలు చేసుకుంటాను."

అంటూ నగుల్నోవు పూర్తిచేశాడు. ఆనగుల్నోవు అఖిలరష్యన్ కమ్యూనిస్టుపార్టీయొక్క 'గ్రిమాచీలాగ్' గ్రామ శాఖకి కార్యదర్శి. "Order of the Red Banner" బిరుదాన్ని పొందేడు. బోరాడిన్ను వారొక పాకలో ఉంచేరు. కొద్దిసేపటికి అతడు మంచినీళ్లు కావాలనీ, ఒక్కమాటు నగుల్నోవును తీసుకురమ్మనీ, కబురంపేడు.

నగుల్నోవు ఇంటి వసారాలోంచి కదలలేదు.

"ఏంకావాలి?"

"మాకర్! జాగ్రత్త. జ్ఞాపకం ఉంచుకో."

సంకెళ్లు చప్పుడయ్యేలాగ బోరాడిన్ చేతులూపుతూ కేకపెట్టేడు.

"మళ్ళీ మనం కలుసుకొనకపోము. ఇప్పుడు నన్ను అధఃపాతాళానికి తొక్కేశావు. దీనికి తగ్గ ప్రతీకారం చేసితీరుతా. ఆ ప్రతిక్రియ ఏమిటో తెలుసునా? హత్య. నిన్ను ఖూనీచేసి తీరుతా. ఇప్పటితో మనస్నేహం ఆఖరు."

"పోరా! ద్రోహీ! నువ్వు చేసేదేమిటి?"

అన్నాడు నగుల్నోవు.

* * * *

ఈవిధంగా ఎంతమంది కులకుల ఆస్తులు లాగుకొనబడి గ్రామాల

నుంచి తరిమివేయబడినారో చెప్పలేము. వారిని అంతరింపచేయడానికి ఇతరకారణాలుకూడా ఉన్నాయి. ౧౯౩౧—౩౨ల లో రష్యాలో పంటలు సరిగ్గా పండలేదు. దేశంలోని రైతులంతా తమకుతిండికి మాత్రం సరిపడే ధాన్యం పండే టంతభూములు మాత్రమే దున్ని మిగిలిన వానిని బీళ్లుగా వదిలివేశారు. కలుపు తీయక, తమకుచాలినంత పంటమాత్రమే కోసికొని మిగిలినది వదలివేసి, ఊరుకొనడంచేత పంటలు నేలంటి పోయినాయి. ఆతరువాత ఏడాది వర్షాలులేక కరువు వచ్చింది. గతసాలునందైనా పంట నిలువ చేయకపోవడంచేత ఈకరువురోజులలో తిండిలేక రైతులు మాడేరు. సోవియటుప్రభుత్వం పన్నులు మానింది. కొన్నిచోట్లకి ఆహార పదార్థాలు పంపించి ప్రజల్ని బ్రతికించింది. అయితేనేం ప్రభుత్వం చెప్పి నట్లు చేయక భూములు బీడుపెట్టినందుకై ప్రజలకి గుణపాఠం చెప్పా లనుకుంది. గతసాలున పంటలు పండించక కరువుకు మాడిపోతూన్న వారందరినీ వేలకొలదిమందిని దూరదేశాలకి తీసుకొనిపోయి పనులు కల్పించి తిండిపెట్టింది ప్రభుత్వం. White sea కాలవను తవ్వడానికి కొన్నివేలమందిని ఉపయోగించేరు. 'ఛెలాబింస్కు,' 'మెగ్నిటగోరస్కీ,' వగైరా పట్టణాలని కట్టడానికి ఎన్నోవేలమందికి పనిచెప్పేరు. ఈవిధంగా అనేకలక్షల కుటుంబాలు ఆస్తులు పోగొట్టుకొని దూరదేశాలకి పంపివేయ బడినాయి.

ఈవిధంగా భూస్వాముల పేరుచెప్పి లక్షలకొలదిమందిని పీడించడం న్యాయమని మేము చెప్పము. కాని, వేర్వేరు రైతుల చేతులలోని భూములన్నీ ఏకఖండం చేసి పెద్దపెద్ద వ్యవసాయక్షేత్రాలను నిర్మిస్తే ఆర్థికంగా చాలాలాభం మాత్రం వుంటుంది. ఏమీ సందేహం లేదు. ఇటువంటి చిన్నచిన్న భూఖండాలన్నీ ఏకంచేసి యంత్రసహాయాన వ్యవసాయం సాగిస్తే ఉత్పత్తి హెచ్చి ప్రజలందరికీ సరిపోయేటన్ని ఆహార

పదార్థాలు పండించవచ్చును. గొప్పగొప్ప పశువుల మందలు, గొర్రెల మందలు పెంచడం అటువంటి సమయంలోనే సాధ్యపడుతుంది. ౧౯౩౧—౩౨లలో పంటలు పోయి, తిండి దొరకక ప్రజలు బాధపడుతూన్నపుడు, వారిని దూరదేశాలకి తీసుకొని పోవడం తప్పు అనిచెప్పలేము. అందులో తప్పులేదు. కాని, ఆతీసుకొని పోయిన పద్ధతిని మాత్రం హర్షించలేము. ఏ విధమైన సాక్ష్యం, విచారణలేకుండా ఘనస్వాములనే ఏరి అననుకూలప్రదేశాలకి తీసుకొనిపోవడం సహించదగి యుండలేదు.*

---

* ఈవిధంగా ఇతరప్రాంతాలకి పంపబడిన కులకులలో కొందరు టర్కో—సైబీరియన్ రైల్వే వేయడానికి ఉపయోగించేరు. ఈరైల్వే నిర్మాణం పూర్తి అయినాక వారచేత పనిచేయించిన ఇంజనీరు ఆకులకులందరికీ ఖాళీగా వున్న ఏదయినా పెద్దభూఖండం చూపించి సమిష్టికృషి క్షేత్రం నిర్మిస్తే బాగుంటుందని సలహా ఇచ్చేడు.

౧౯౩౩ ఆగస్టులో సోవియటుయూనియన్‌లో సెటిల్మెంటుకమిటీ ఏర్పడింది. ఆకమిటీ ఉత్తరకకేషియాపర్వతప్రాంతాలనుంచి అనేక గ్రామాలలోని కోసక్కులను వేలకొలదిమందిని దక్షిణసైబీరియాలోని వ్యవసాయానుకూలప్రదేశాలకు కలస పంపించింది.

# ‘ఛెకా’ ‘ఒగ్పూ’,ల కార్యక్రమం.

“వార్—కమ్యూనిజం-పోలసీ,” అంతర్యుద్ధాలు, విదేశీయుల దాడులు, ౧౯౨౧-౨౨నాటి కరువు, నవీనఆర్థికనీతి కారణంగా ఏర్పడిన పెట్టుబడిదారుల్నీ, భూస్వాముల్నీ, తొలగించడానికై ప్రభుత్వం అవలంబించిన విధానము, కారణంగా రష్యనుప్రజలు నిరంతరం కష్టాల ననుభవించేరు. అయితేనేం ౧౯౧౮-౨౦లమధ్య బోల్షివికుప్రభుత్వానికి సహాయం చేసినవారు కమ్యూనిస్టుపార్టీసభ్యులు ఇరవై లక్షలే కారు. పరిశ్రమల కూలీలు, గనులలోని కూలీలు, రైల్వేకూలీలు, లక్షలకొలది ఎర్రసేనలు, ఎవరో కొందరు మినహాగా రైతులంతా కూడా పూర్తిగా సానుభూతి, సహాయం, ఇచ్చేరు.* ప్రజలలో రాజకీయపరిజ్ఞానం కలిగించీ,

* మొత్తంమీద రష్యా అంతట బోల్షివికులకు పలుకుబడి ఉంది. ౧౯౧౭, నాడు జరిగిన ఎన్నికలలో బోల్షివికులకే ఎక్కువ వోట్లు వచ్చినాయి. ఆనాటి విషయాలన్నీ చూచినవారే ఈలాగ వ్రాసేరు. “మొత్తం

తమసిద్ధాంతాలను ప్రచారంచేసి, కమ్యూనిస్టుపార్టీ ప్రజలలో పలుకుబడి సంపాదించుకొందని ఇంతకు పూర్వమే చెప్పేను. అయినా జమీందార్లని, వారిసహాయుల్ని, పెట్టుబడిదారుల్ని, అణచివేయడంలో ప్రభుత్వానికి తోడ్పడి విద్రోహుల్ని అణచివేసిన వారిని గురించి ఇంకా మనం తెలుసుకోవాలి. దేశం నాలుగుమూలలా శాఖోపశాఖలతో వ్యాపించియున్న 'ఓగ్పూ'—'ఛెకా' సంస్థలు ఈకార్యాన్ని నిర్వహించేయి. వీనిలో ఓగ్పూ శాఖ ౧౯౨౩లో దేశీయాంగశాఖామంత్రిమండలికి ( Nar-komvutdel) అనుబంధించబడింది.

ప్రజల్ని తీవ్రనిర్బంధాల పాలుచేయడం రష్యాపోలీసులకి కొత్త కాదు. చరిత్రకేసి చూస్తే 'పీటర్'కాలంనుంచీ ఈఆచారం అనువంశికంగా వస్తూన్నట్లు తెలుస్తుంది. ౧౮౨౫లో డాకోబసువిప్లవం జరిగేక ౧వనికోలసు 'జండర్మీ' దళాలను ఏర్పాటుచేసి, ప్రజల్ని బహుక్రూరంగా హింసించేడు. తరువాత తరువాత ఈశాఖయే 'ఒక్రానా' అనేపేరుతో ౧౯౧౭ఫిబ్రవరి వరకు నిరాఘాటంగా సాగింది. ఫిబ్రవరి విప్లవం తర్వాత ఇది కొంతకాలం లోపించింది. 'కెరన్‌స్కీ' తన అధికారకాలంలో దీనిని

---

మీద మధ్యరష్యాలో ప్రజలు విప్లవం కోసం తహతహ లాడిపోయేరు. ఉత్తర, మధ్య, రష్యాలలో మొత్తం Pole అయిన వోట్లలో బోల్షివికులు నూటికి ౫౫ వరకు సంపాదించేరు. ధనికవర్గం హెచ్చుగా వుండే యూక్రెయిన్, దక్షిణరష్యా, సైబీరియా, కకేషియస్, ప్రాంతాలలో సోషల్-రివల్యూషనరీలకి హెచ్చు వోట్లు వచ్చేయి. అయితేనేం, జాతీయ సేనలు (Whites) చూపినదౌర్జన్యం అక్కడకూడా బోల్షివికులకే పలుకుబడి సంపాదించి పెట్టింది."

The Russian workers republic.
— H. N. Brailsford.

ప్రసుత్తరింపాలని ఊహించేరు. కాని, ఆపని పూర్తికాకుండానే అతని ప్రభుత్వం కూలిపోయింది, అక్టోబరులో విప్లవంవచ్చి బోల్షివికుల ప్రభుత్వం ఏర్పడింది. ఆరోజులలో దేశం అంతటా ఏర్పడిన విప్లవప్రతికూలురను. విద్రోహులను, వెదకి—వెదకి నిర్మూలించడానికి ఒక రహస్యరక్షకభట శాఖను ఏర్పరచకతప్పదని వారుకూడా నిశ్చయించేరు.* రష్యనుబోల్షివిక ప్రముఖులలో ఒకరైన ఫెలిక్సు—ఝర్జన్స్కీ సలహాప్రకారం అక్టోబరువిప్లవం జరిగినకొద్దిరోజులకే "విద్రోహ—వాణిజ్య-ప్రతిష్టంభనానిర్మూలకఅసా

---

* ౧౯౧౭. డిసెంబరు. ౧౧. వ. తేదీన "ప్రజాస్వామికవాదులు (Constitutional democrats.) నేటినుంచీ ప్రజాద్రోహులుగా పరిగణింపబడుతారు." అంటూ లెనిను ఒక ప్రకటన చేశాడు. ఆ తీర్మానాన్ని అనుసరించి 'Kadet Party' సభ్యులు తీవ్రశిక్షలు పాలుచేయబడ్డారు. డిసెంబరు౧౯–౨౦. తేదీలలో విద్రోహుల్ని అణచివేయడానికి లెనిను ఒకవిధానం తయారుచేసి దానిని 'ఝర్జన్స్కీ'కి పంపించేడు. దేశీయాంగశాఖ స్థానికసంస్థల సహాయంతో పెట్టుబడిదారుల్నీ, జమీందారుల్నీ, ధనికవర్గాన్నీ, జాగ్రత్తగా కనిపెట్టి చూస్తూండాలని లెనిను ఇందులో సూచించేడు. నెలకు ౫౦౦ రూబుళ్ళు, అంతకు పైబడీ ఆదాయం తెచ్చుకొనేవారు, పెద్దనగరాలలో ఆస్తులు గలవారు, వేయిరూబుళ్ళకు పైబడ్డ ధనం గలవారు ధనికులుగా నిర్ణయించబడినారు. పెట్టుబడిదారులు, జమీందారులు, ఇతరధనికవర్గములు, బ్యాంకులలోని ఉద్యోగులు, మొదలగువారంతా తమపనుల్నీ సంపాదనలను, గురించి, వివరంగా ప్రభుత్వానికి తెలియబరచాలని ఆజ్ఞాపించేరు.

Lenin. Red director.
— G. Vernadsky.
(1931.. PP. 190)

ధారణసమితి" అనేపేరుతో ఒకగూఢచారిదళాన్ని ఏర్పాటుచేసేరు. ఆపేరు యొక్క సంక్షిప్తరూపమే 'ఛెకా'. ౧౯౧౭ నవంబరు ౭వ తేదీన చేసిన ప్రకటన వలన దానిలో ౧౮గురు బోల్షివికులు సభ్యులుగా నియమించబడి దానికి 'జర్ఘన్స్కీని' అధిపతినిగా చేశారు. జారులనాటి 'ఒక్రానా' కు గల అధికారాలన్నీ దీనికి కూడా ఉన్నాయి. దీనిలో 'ఒక్రానా' ఉద్యోగు లెవ్వరూ లేకపోయినా విధానం మాత్రం అదే. 'ఒక్రానా' దేశీయాంగమంత్రికి సమాధానం చెప్పవలసియుండేది. ఈఛెకా 'సోవనార్కమ్' కి సమాధానం చెప్పవలసియున్నా దానియొక్క అసంయతత్వం కారణంగా స్వేచ్ఛా వృత్తిని అవలంబించింది. ఒక్రానాకు లేని మరణశిక్ష విధించే అధికారం కూడా దీనికి ఈయబడడం చేత 'ఛెకా' చాలానిరంకుశంగా ప్రవర్తిం చింది.

౧౯౧౭—౨౨ ల మధ్య ఈ 'ఛెకా' బహునిరంకుశంగా ప్రవర్తించి పేరు చెప్పితే ప్రజలు గజగజ లాడిపోయేటట్లు చేసింది. ఆనాలుగేళ్ళు అది చూపిన క్రౌర్యం, నిరంకుశత్వం సమయోచితంగానే వున్నాయి. హఠాత్తుగా ఛెకా చేసే నిర్బంధాలు, రహస్యవిచారణలు, ఉరిశిక్షలు, దేశంలో శాఖోపశాఖలతో వ్యాపించి ప్రభుత్వవ్యతిరేకులకి హడలెత్తించే గూఢచారిదళం, మొదలయిన వానిని గురించి యూరపుఖండభాషలన్నిటి లోను అనేకపుస్తకాలలో అతివిపులంగా వర్ణించబడి యున్నాయి. Whites ఆక్రమించిన చోట్ల వారు, Reds ఆక్రమించినచోట ఈఛెకా, తమదౌర్జన్యవిధానాన్ని నిరాఘాటంగా సాగించేయి అనడంలో అబద్ధం లేదు.

౧౯౨౨లో దేశంలో శాంతి పూర్తిగా ఏర్పడడంతోటే తనపని తీరిపోవడంచేత ఛెకా రద్దయిపోయింది. ౧౯౧౭—౨౨లమధ్య సోవి యటుప్రభుత్వాన్ని ఎదుర్కొన్న సమస్యలకి ఈఛెకాయే లేకుంటే, ఈశాఖ

అంత నిర్దయగా ప్రవర్తించకుంటే మహాప్రమాదం తటస్థించేదే. ౧౯౧౮ లో వర్గకలహం తీవ్రరూపం ధరించింది. ఈవర్గకలహం ఒక పట్టాన చల్లారే రకం కాదు. రెండు దేశాలమధ్య యుద్ధం అయితే సంధి జరిగిన వెంటనే ప్రజాశాంతి కలగవచ్చును. కాని, రష్యావంటి దేశంలో వేరువేరు సాంఘిక-ఆర్థిక-రాజకీయసిద్ధాంతాలకోసం కోట్లకొలదిప్రజలు ఒకరితో నొకరు పోట్లాడుకోవడం సాగిస్తే ఆకలహం ఒకంతట చల్లారుతుందా? ఈపేచీలో ఓడినవారు విజేతలకు లొంగిపోక కుట్రలు సాగించేరు. దొంగలు—హంతకులుమొదలయినవారు Whitesఅనీ, మెన్షవికులుఅనీ, పేర్లుపెట్టుకొని ప్రజల్ని దోచుకొని పీడించడం ఆరంభించేరు. ఫ్రాన్సు ఇంగ్లండులలోవలె సమర్థమైన పోలీసుశాఖ ఆరోజుల్లో రష్యాలో లేదు. పట్టణాలలో కూడా దోపిడీ, బందిపోటు, హత్య జరగకుండా చూడ డానికి తగిన రక్షకశాఖ లేకపోయింది. అందుచేత ౧౯౨౨లో నవీన ఆర్థిక నీతిని అమలులో పెట్టినపుడు రద్దుచేయబడిన 'ఛెకా' స్థానంలో Union state political administration అనేసంస్థ ఏర్పాటుచేయ బడింది. దీనినే 'ఓగ్పూ' లేక "జి.పి.యూ." "గే.పే.యూ" అంటారు. ఛెకా ప్రధానాధికారి ఝుర్జన్స్కియే దీనికీ నాయకుడు. ఉద్యోగులంతా వెనక ఛెకాలోనివారే. మొత్తంమీద పేరు మార్పుతప్ప ఛెకా ఓగ్పూలు రెండూ ఒక్కటే. ఛెకా తననిరంకుశత్వాన్ని కొద్దిమార్పులతో ఓగ్పూ పేరుతో ఆరంభించింది.

# ౧౬

# 'ఓగ్పూ' శాఖ.

రష్యా గూఢచారిదళశాఖని 'ఓగ్పూ' అంటారు. ఈశాఖ దేశం అంతటా శాఖోపశాఖలు కలిగి విస్తరించివుంది. ఇందు రెండు ప్రధాన భాగాలు ఉన్నాయి. వానిలో ఒకటి కార్యకర్తలకే పరస్పరం గుర్తెరగలేనంత గూఢమైన శాఖ. రెండోశాఖలో ఉద్యోగులకి యూనిఫారములు, సమస్త సౌకర్యాలుగలబారకీసులు, 'ఓగ్పూ'—బాడ్జీలు ఉంటాయి. వీరిని చూస్తే విదేశీయులుకూడా హడలుతూవుంటారు. ౧౯౩౪ వరకు ౧౫మందికమిస్సార్లుగల ఒకసంఘంచేత ఈశాఖ పరిపాలించబడింది. ఈకమిస్సార్లు అంతాకలసిగాని, వేర్వేరుగా ఉపసంఘాల సహాయాన గాని పనులు నిర్వహించేవారు. సాధారణసమావేశంలో (Plenum) నిర్ణయించబడిన విధానాల ననుసరించే ఈకమిస్సార్లసంఘం నడవాలి. సంఘాధ్యక్షుడు సర్వాధికారాలు కలిగియుండి 'సోవానార్కుం'తో ప్రత్యక్షసంబంధం కలిగి ఉంటాడు. ౧౯౨౬ వరకు ఈసంఘానికి 'ఝర్జన్స్కి'అధ్యక్షుడుగా వుండే

వాడు. అతడు సర్వస్వతంత్రుడుగా చాలా జాగ్రత్తతో నడిపించేడు. ఆతనివెనక జమీందారీకుటుంబంలో పుట్టిన 'మెంజిన్‌స్కీ' అనే పోలెండు దేశస్థుడు అధ్యక్షత వహించేడు. ఈతనికాలంలో శాఖానిర్మాణంలో బలం పెరిగింది. ౧౯౩౪ లో ఈతను చనిపోయిన వెనుక శాఖ అంతా ఒక్కమారు సంస్కరించబడి 'యజ్జోన్స్కీ' అంతరంగికుడుగా వుండే 'యగోడా' అధ్యక్షుడుగా నియమించబడ్డాడు.

ఈశాఖ ౬ పేర్వేరు డిపార్టుమెంట్లద్వారా తనకార్యక్రమాన్ని నడిపిస్తూవుంది.

౧. సాధారణశాఖ. (O. O.)—ఇది ఓగ్పూఉద్యోగీయులకు, వారి ప్రత్యేకసైనికదళాలకు, మార్గంచూపుతూ వాని పై అజమాయిషీ చేస్తూంటుంది.

౨. విదేశాంగశాఖ. (I. N. O.)—విదేశీయుల్నీ, విదేశాలకిపారిపోయిన రష్యలను, కనిపెట్టి చూస్తూంటుంది.

౩. ఆర్థికశాఖ. (E. K. U.)—పరిశ్రమలలో పనిచేస్తూ వాటిని నాశనం చేయడానికి ప్రయత్నించేద్రోహుల్నీ, లంచగొండుల్నీ, కనిపెట్టి వుంటుంది.

౪. రహదారీశాఖ.—ప్యాస్‌పోర్టుల్ని తణిఖీ చేయడం, రైల్వేల మీద, నౌకలమీద కట్టుబాట్లను ఏర్పాటుచేయడం, ఈశాఖ పని.

౫. ఎర్రసైన్యాల శాఖ.—సైన్యాలలో చేరి ప్రభుత్వశత్రువులుచేసే కుట్రలు, తిరుగుబాట్లు, ప్రచారాలు, కనిపెట్టివుండి వారిని అణచివేస్తూంటుంది.

౬. రహస్యశాఖ. ( S. O. )—రష్యా అంతటా గల విప్లవద్రోహుల్ని కనిపెట్టియుంటుంది.రష్యాలోని పెద్దపెద్ద పట్టణాలన్నిట 'ఓగ్పూ' ఆఫీసులున్నాయి. ఆదేశంలో ప్రయాణంచేసే యాత్రికు

లంతాతమకు కావలసిన విషయాలను గూర్చి సలహాలుగానీ, వివరాలుగాని, సహాయంగాని, ఈ ఆఫీసులతో పొందవచ్చును.* ఈఆఫీసులన్నీ తమతమ హయాములోని ప్రదేశాలను సర్వదా కనిపెట్టి ఉంటాయి. తిరుగుబాటు జరిగే సూచనగాని, అశాంతిగాని, కనపడిందా వెంటనే దానిని అణచివేయడంలో స్థానిక మిలీషియాకు* (పోలీసు) సహాయంచేయడానికై ప్రతిక్షణం సిద్ధంగా వుంటుంది. రైళ్ల

---

* రష్యాపరిశ్రమలలో పనిచేసే అమెరికనులు, 'ఓగ్పూను' కష్ట సమయంలో తోడ్పడే మిత్రునిలాగ చూసుకుంటారు. సాధారణంగా రష్యారైళ్ళలో చోటు దొరకదు. అటువంటి సమయంలో ఓగ్పూ ఆఫీసుకి తెలియపరుస్తే ఆఉద్యోగులు ప్రతిరైలులోను తమకోసం ప్రత్యేకించబడిన ప్రదేశాలను ఇచ్చి సహాయం చేస్తారు. ప్యాస్‌పోర్టు విషయంలో ఏదైనా తగాదా వస్తే ఓగ్పూకు తెలియపరచేస్తూ, వారు తమ ఓపిన సహాయం చేస్తారు. ఏవిదేశీయుడైనా తానుపనిచేసే ఫ్యాక్టరీయజమానుల చేత అనుమానించబడి చిక్కులలో పడితే ఒక్క ఓగ్పూ మాత్రమే వారిని రక్షించగలదు. ఏవిషయంలో నైనాసరే విదేశీయులకి ఆ దేశంలో సాయం చేయగలది ఒక్క ఓగ్పూమాత్రమే. దేశీయులు విదేశీయులతో ఏమాత్రం సంబంధం పెట్టుకున్నా ఓగ్పూ వారిని ఒకకంట చూస్తూంటుంది.

* సాధారణంగా అన్నిదేశాలలో పోలీసు అంటారు. కాని, రష్యాలో ఆపేరు ఉపయోగించరు. దీనికి కారణం, వారిభయంకరప్రవర్తన వలన కలిగిన అసహ్యము భయమే. వీరిని రష్యనులు మిలీషియా అనే అంటారు. 'ఓగ్పూ' గూఢచారుల్నికాని, యూనిఫారాలుగల రక్షకభటశాఖను కాని, వారు 'పోలీసు' అని పిలవరు.

పడిపోయినా, వరదలు ముసిరినా, కరువు వచ్చినా, అగ్నిప్రమాదాలు సంభవించినా, ఏమని వచ్చినా సరే ఈశాఖ సిద్ధమే. ఎర్రసైన్యాలతో కాకుండా విడిగానే ఈశాఖవారి సేనలు (౧౯౩౪వరకు) ఎప్పుడూ సిద్ధంగా వుండేవి. దేశపు సరిహద్దులమీద స్థావరం ఏర్పరచుకొని, కని పెట్టుకొనివుంటూ విదేశగూఢచారుల్ని దేశంలో రాకుండా చూస్తూం డేవి. సుంకాలు వసూలు చేస్తూండేవి. అవసరం వస్తే తిరుగుబాట్లని అణచివేయడానికి సర్వసన్నద్ధంగా వుండేవి.

ఓగ్పూయొక్క రెండవభాగం అయిన రహస్యశాఖను గురించీ, దానిలో పనిచేసే గూఢచారిదళాన్ని గురించీ, వివరాలేమీ తెలియవు. ఆ శాఖలో పనిచేసే వారికే ఒకరి సంగతి వేరొకరికి తెలియవు. ఈగూఢ చారులు రైల్వేలలో, యంత్రాలయాలలో, ఆఫీసులలో, పనిచేస్తూ కాస్త అనుమానానికి చోటిచ్చినవారినెల్ల సర్వదాకనిపెట్టి తిరుగుతూ వుంటారు. ఇతరదేశాల గూఢచారిదళాలకీ, దీనికీ, గల భేదాన్ని తెలుసుకొనడానికి అవకాశాలేవీ లేవు. కాని ఒక తేడా మాత్రం వుంది. ఇతరదేశాలలోని గూఢచారశాఖకు కుట్రలు కనుగొనడానికే గాని, విచారణాధికారం లేదు. ౧౯౩౪వరకు 'ఓగ్పూ'శాఖకు నేరాలు కనిపెట్టడంతోపాటు విచారణాధి కారం కూడా వుంది.

'ఓగ్పూ' యొక్క ముఖ్యకర్తవ్యం విప్లవద్రోహుల్ని తెగటార్చి విప్లవాన్ని నిరాఘాటంగా సాగించడమే కాదు. విప్లవప్రతికూలురు సోవి యటుశత్రువులతోచేరి చేసే కుట్రలు అణచివేయడం, దోపిడీలు, ప్రజా శాంతికి భంగం కలిగించే తిరుగుబాట్లు, ప్రభుత్వాస్తుల్ని ధ్వంసంచేసే ప్రయత్నాలు జరగకుండా చూడడం ఈశాఖ యొక్కపనులే. సోషల్— రెవొల్యూషనరీలు, మెన్షవికులు, Kadets మొదలయినవారి పార్టీలలో సాధారణసభ్యులుగా చేరడం కూడా నిషిద్ధమే. రష్యానుంచి విదేశా

లకు పారిపోయి యూక్రెయిన్—జార్జియా మొదలైన దేశాలను విడదీసి స్వాతంత్ర్యం సంపాదించడానికై సంఘాలు స్థాపించుతూ, కుట్రలు చేస్తూ, సైన్యాలు సమకూర్చుకుంటూ, ఉండేవారి ఆచూకీ ఏమాత్రం తెలిసినా పట్టుకొని ఉరిశిక్షలు వేసేసేవారు. సమిష్టికృషిక్షేత్రాలలో చేరి వానిని భగ్నం చేసేటందుకే సర్వదా ప్రయత్నించే కులకుల్ని వీరు దేశ శత్రువులుగా ఎంచి కనిపెట్టుకుంటూ ఉండేవారు. ౧౯౩౩ జనవరిలో కగానోవిచ్ కమ్యూనిస్టుపార్టీకి ఒక రిపోర్టుపంపేడు.

"గ్రామసీమలలో సోవియటుశత్రువులు ప్రభుత్వాన్ని చాలా తీవ్రంగా ఎదుర్చుతూన్నారు. ఆర్థికంగా దుర్బలస్థితిలో వున్నా పూర్వపు పలుకుబడి పూర్తిగా పోగొట్టుకొనని కులకులు, White ఆఫీసర్లు, మఠాచార్యులు, పూర్వపు జమీందార్ల కుటుంబాలవారు, పంచదారమిల్లుల యజమానులు, కోసక్కులు మొదలైన వారు, సోవియటుప్రభుత్వశత్రువులైన జాతీయవాదులు, సోషల్—రివొల్యూషనరీలు, పెట్లూరా మొదలగువారు, ఇంటిలిజెన్టియా వర్గము గ్రామసీమలలో స్థిరపడి సమిష్టివ్యవసాయ క్షేత్రాలు ధ్వంసం చేయడానికి, కమ్యూనిస్టుపార్టీ—బోల్షివికుప్రభుత్వము వ్యవసాయంలో తీసుకురాదలచిన అభివృద్ధిని—మార్పును, చేతనయినంత వరకు నిరోధించడానికి, ప్రయత్నాలు చేస్తున్నారు.*

---

* కమ్యూనిస్టుపార్టీయొక్క సెంట్రలకమిటీ సాధారణసమావేశం ముందు స్టాలిన్ ఉపన్యాసంలో ఈవిషయం ఎత్తుకున్నాడు.

"స్థానికసంఘాలలోని మనమిత్రులు (Comrades) కులకులతోడి పోరాటంలోని మార్పును సర్దుకొని నిలవబడలేకపోయారు. గ్రామకంతాలలో వర్గశత్రువుల స్వరూపాలు మారినాయని వారు గుర్తించలేకపోయారు. దానికి తగినట్టుగానే మన పన్నుగడలు కూడా మారుతేగాని నెగ్గలేమని వారు గుర్తించలేకపోయారు. ............ వర్గశత్రువు లింకా సమిష్టి

సోవియట్ ప్రభుత్వం చేత అపూర్వకాని ఏకార్యము అయినాసరే, విప్లవప్రతికూలకార్యముయగానే 'ఓగ్పూ' దృష్టిలో లెక్క. ౧౯౧౭ఫిబ్రవరి దాకా ఒకఅర్ధశతాబ్దంపాటు జీవించియున్న 'ఒఖ్రానా' కాని, వార్—కమ్యూనిజం రోజులలోని 'ఛెకా' గాని, ౧౯౩౪వరకు ౧౩ ఏళ్ళపాటు ఏకాధ్వరంగా పరిపాలించిన 'ఓగ్పూ' గాని, చేసిన మంచీ—చెడ్డా మన

---

క్షేత్రాల బయటనే ఉన్నారని వారి తలపు. భయంకరమైన ముఖాలతో, పెద్దపెద్ద పళ్ళతో, బలిసిన మెడలతో, చేతుల్లో తుపాకి పుచ్చుకొని నిల్చున్నారనే వారి ఊహ. మనం పోస్టర్లలో (Posters) చూసే మాదిరి కులకులకోసమే నిరీక్షిస్తున్నారు. కాని, ఆమాదిరి కులకులు అంతర్ధానమై చాలాకాలం అయింది. నేటి కులకులు - వారి అనుచరులు, గ్రామసీమల లోని నేటి సోవియట్ శత్రువులు చాలవరకు మధురభాషణులు. ఋషి తుల్యులు. నేడు కులకుల్ని చూడాలంటే సమిష్టిక్షేత్రాల్ని విడిచి దూరం పోనక్కరలేదు. సమిష్టిక్షేత్రాల లోపలనే వారున్నారు. కొట్టుపెత్తందార్లుగా, వ్యాపారపుయజమానులుగా పుస్తకవిక్రేతలుగా, కార్యదర్శులుగా ఇంకా ఈలాగంటి ఉద్యోగాలలోనే దూరిఉన్నారు. నేటి కులకులు "సమిష్టిక్షేత్రాలు ధ్వంసం కావాలి" అని హెచ్చరిక నీయరు. నేడు వారు సమిష్టిక్షేత్రాలకోసమే పనిచేస్తారు. వారికేవిధంగానూ ఉపయోగించక పోయినాసరే లోపలలోపలనే ఉండి స్తంభింప చేస్తారు. సమిష్టి క్షేత్రాలని విడగొట్టేటందుకే పూర్తిగా పనిచేస్తారు. "ధాన్యపు పన్నులు దగ్ధం కావాలని" వారెన్నడు పలుకరు. వారు కూడా ధాన్యం పోగు చేస్తారు. కాని, వారు తాము నాయకత్వం వహించి నడుపుతూన్నట్లు నటిస్తారు. అవసరం కంటె అనేకరెట్లెక్కువ పశువులకోసం ఆకట్టాలంటారు. జీవితప్రభీమాలకై ఎక్కువభాగం వేరుచేసి ఉంచాలంటారు. ప్రతి కూలివానికి ౬ మొదలు ౧౦ పౌనులవరకు ధాన్యం ఇయ్యాలని చెప్పుతారు.

కేమీ తెలియదు. కాని, ఒకటి. ఈమూడు సంస్థలు కూడా దోషి—నిర్దోషి అనే మాటలతో పనిలేకుండా అందరినీ హడలెత్తించేయి. "ఎలెన్ మాంక్ హౌస్" అనే ఆతడు ఈవిషయంలో వ్రాసిన వ్రాతలు గమనించ తగి ఉన్నాయి. "దోషుల్ని పట్టుకొని 'డిటెన్షను క్యాంపు'ల లోను, జైళ్ళ లోను పెట్టి, వారిని విపరీతమైన బాధలకు లోను చేస్తూన్నట్లు ఓగ్పూయే భయంకరమైన వార్తలు వ్యాపింప చేస్తుంది. ఈమధ్య లెనిన్‌గ్రాడ్‌లో ఓగ్పూశాఖకై భవనాల కట్టుబడి పూర్తియైనాక ద్రోహుల్ని పట్టుకొని బాధించడానికి తానొక యంత్రం తయారుచేసి సిద్ధంచేసినట్లూ, ఆయంత్రం యొక్క బాధ సహించశక్యం కానట్లూ ఒకవార్త వ్యాపింపచేసింది. ఈవిషయం ఎంతమాత్రమూ నిజం కాదని నా నమ్మకం. అయితేనేం, లెనిన్‌గ్రాడ్ ప్రజలు ఈవార్తను అక్షరశః నమ్ముతారు. ఓగ్పూశాఖ ద్రోహులను పెట్టే బాధలను గురించిన కథలు మాస్కోలో కూడా వినబడుతూనే వుంటాయి. ఈచెప్పుకునే మాటల్ని చూస్తే స్పానిషుపరిశోధకశాఖ*

---

ఈలాగంటివే ఒకలతు. ఆవప్రత్యేకభాగాలు, ఆధాన్యదానం, ఈలాగంటి మూర్ఖపునాయకత్వం, తోటి సమిష్టిక్షేత్రాల ఆర్థికశక్తి కృంగిపోతుంది. ఇంక ధాన్యం పోగుచేయవలసిన పనే ఉండదు."

(Moscow Daily News.
— 1933. జనవరి 18.)

* రోమను కాథలికు చర్చికి విరుద్ధాభిప్రాయాలు కలవారిని నిర్మూలించడానికై నాలుగవ పోప్ ఇన్నోసెంటుకాలంలో ఈశాఖ బయలు దేరింది (౧౨౪౮). ప్రపంచదేశాలన్నింటా వ్యాపించినా స్పెయిన్‌శాఖ చాలా క్రూరంగా ప్రవర్తించి విఖ్యాతం అయింది (౧౫వశతాబ్దం). టార్క్వెమేడా అనేవాని అధికారం క్రింద ఇది శాఖోపశాఖలతో వర్ధిల్లి అనుమానం తగిలిన వారినెల్లా నాశనం చేసింది. వారికి పెట్టిన బాధ అనంతం. —అనువాదకుడు.

యొక్క దారుణాలుకూడా మనసుకు వస్తాయి. కాని, క్రియలో ఓగ్పూ అంత భయంకరమైనది కాదనే నా సంపూర్ణమైన విశ్వాసం. అయితే ఓగ్పూ ఈలాగంటి మర్మాస్త్రలను తానే ఎందుకు ప్రచారం చేస్తూంది? దీనికి కారణం లేకపోలేదు. మాటలతోనే ఖైదీలను హడలకొట్టి కావలసిన వివరాలన్నీ వారినుంచి సులకనగా లాగడానికే."

ఓగ్పూ చర్యలు ఈలాగే వుంటాయి. అది విధించే శిక్షలు కాని, వానిని అమలు జరిపే పద్ధతిగాని, వింటే గుండెలు ఝల్లుమంటాయి. ఈశాఖ చేసే పనులన్నిటినీ రహస్యంగానే జరిగిస్తుంది. అరెస్టులు చేయడం అర్ధరాత్రులందే. వారి సంగతి ఏమయినదీకూడా ఎవ్వరికీ తెలియనీయరు. ఒకప్పుడు ఒకఫ్యాక్టరీ కాలిపోయిన సందర్భంలో ౩ గురు ఇంజనీర్లు అరెస్టుచేయబడ్డారు. విప్లవప్రతికూలకార్యక్రమంకి తలపెట్టినట్లు వారిమీద నేరం మోపబడింది. ౩ గురు జడ్జీలు గల ఒక కోర్టు వారినిఅతిరహస్యంగా విచారణచేసి దోషులనుగా నిర్ధారణచేసి మరణ శిక్ష విధించింది. ఇంజనీర్లు చేసుకొన్న అప్పీలులో కూడా ఆశిక్ష ఖాయపడింది. అంతతో ఊరుకొనక వారి భార్యలు పునర్విచారణకై మాస్కోలోని పైయధికారులకు విజ్ఞాపనం పంపుకున్నారు. అక్కడ కూడా అదేశిక్ష ఖాయపరచబడింది. ఇంకేముంది ? ఓగ్పూ ఆముగ్గురినీ మింగేసింది. పత్రికలలో "డిసెంబరు ౬౧ తేదీరాత్రి ఇంజనీర్లు కాల్చి చంపబడినట్లు" ప్రకటించబడింది.

"ఓగ్పూ ఎవ్వరికైనా మరణదండన విధిస్తే ఆశిక్ష Convicting Prosecutor ద్వారా అమలు జరపబడాలి. మరణదండన విధించ బడినవారు వరుసగా నిలువబెట్టి కాల్చిచంపబడరు. ఓగ్పూదళముయొక్క కావలాలో అధికారుల్ని చూడడానికై జైలునుంచి వెళ్ళేటప్పుడు మెడ వెనుకభాగంలో తుపాకీతో కాల్చిచంపుతారు. ఇందులో ఒకవిశేషం కూడా

వుంది. పత్రికలలో ఫలానాతేదీన ఫలానావాడు కాల్చిచంపబడినాడని ప్రకటనలు వెలువడతాయేగాని నిజానికి వారిని ఓగ్పూ చంపనేచంపదు. అధికారరీత్యా చంపబడినట్లు ప్రకటనలు జరిగిపోయినా ఆతడు ఓగ్పూ కాపలాలో తన ఉద్యోగం నెరవేరుస్తూనే వుంటాడు. రష్యాలో సమర్థులగు ఇంజనీర్లు చాలా తక్కువ. అందుచేత బోల్షివిక ప్రభుత్వం తన విరోధులచేత కూడా బలవంతంగా చాకిరీ చేయించుకుంటుంది. *

---

*Working for the Soviets నుంచి.

"విప్లవప్రతికూలకార్యక్రమంలో పాల్గొన్నందులకై ఓగ్పూ చేత మరణశిక్ష విధించబడిన ఒక రష్యనుస్పెషలిస్టును ఒకపట్టణంలో, పెద్ద హోటలులో, శుభ్రమైన గదిలో నివసిస్తూ ఉండగా చూసేను. ఈస్పెషలిస్టు కొద్దికాలం మాత్రం జైలుశిక్ష ననుభవించేడు. తరువాత ఒకట్రస్టు యొక్క యజమాని కోరికప్రకారం ఆతడు భార్యతోసహా ఆహోటలులో ఉంచబడి ఆట్రస్టులో పనికి నియోగించబడ్డాడు."

ఒక అమెరికాదేశీయుడు ఇటువంటి విషయాలు చాలా చెప్పేడు.

"ఒక వ్యవసాయనిపుణుడు ౧౯౨౮లో జైలులో వుండగా చూచేను. ఆతడే ౧౯౩౧లో ఒక పెద్ద ఉద్యోగంలో వుండగా మరల చూసేను. ఈయన ఈమధ్య మధ్యఆశియాలో ప్రత్తిపంటను అభివృద్ధి చేయడానికి పంపించబడి ఆపనిని చాలా జయప్రదంగా నెరవేర్చేడు."

"ప్రోంపార్టీ విచారణలో మరణశిక్ష విధించబడిన ప్రొఫెసరు 'రాంజిన్' తిరిగి తన ఉద్యోగంలోనే నియమించబడినాడు. ఈతడు మొదట్లో కొంతకాలం ఓగ్పూ కాపలాక్రిందనే పనిచేశాడు. తరువాత ఆకాపలా కూడా తొలగించబడింది. రాంజిన్ నివసించేఇల్లు, ఆతని స్వంతకారు, బిరుదులు, గౌరవప్రపత్తులు, సర్వం పోయిశాయి. మిగిలినది ఒక్క పదవి మాత్రమే. ఇంతమంచియైనా కుట్రలు మానివేసి, సోవియట్ల ఆశ్రి

ఓగ్పూను గురించి పూర్తి వివరాలు తెలుసుకొనడానికై ప్రత్యేక కృషి చేసిన 'ఎలెన్ మాంక్ హౌస్' తాను వ్రాసిన "Mascow ౧౯౧౧—౩౩" అనే పుస్తకంలో ఈలాగ వ్రాసేడు. "ఓగ్పూ తరుచుగా అనేకమందికి మరణదండన విధిస్తూఉంటుంది. కాని వారందరు చంప బడతారని నేను అనుకోను."

సాధారణంగా గొప్ప రాజకీయనేరం చేస్తేనే గాని. ఎవ్వరికీ ఉరి శిక్ష విధించరు. ఓగ్పూచేత అరెస్టుచేయబడిన వారిలో చాలామంది చట్టాలను అతిక్రమించేరనే నేరం క్రిందనే విచారణకోసం సాధారణపు కోర్టులకు పంపించబడతారు. సోవియటు ప్రభుత్వంమీదనే విరోధం కలిగి

---

వృద్ధికి మనఃపూర్వకంగా పనిచేస్తే పోయినవన్నీ తిరిగి సంపాదించుకో వచ్చును.

In Place of Profit. PP. 91—92

"ఇంతక్రితం చెప్పినట్లు దోషులని ఋజువైనా ఘోరశిక్షలు విధించ బడినా ఓగ్పూ ఎవ్వరినీ ఉరితీసియుండలేదు. ౧౯౩౩లో మేము జైళ్ళను చూడడానికి వెళ్ళినప్పుడు, విప్లవవ్యతిరేకచర్యలకై మరణశిక్ష విధించ బడిన ఒకడాక్టరు జైలులో డాక్టరుగా పనిచేయడం మేము చూసేము."

"Soviet Russia fights Crime."

పుట. 23_24.

"౧౮ మాసాలక్రితం ప్రరిశ్రమలు నాశనం చేయడానికి ప్రయత్నం చేసేడని మరణశిక్ష విధించబడిన ఒక ఇంజనీరు తన శిక్షాకాలంలో దేశసేవ కోసం అతడు చేసినపనికి ౧౦౦౦౦రూబుళ్ళ బహుమానం చేసి పూర్వపు ఉద్యోగంలోనే మరల నియమించేరు."

(Ibid—PP. 46.)

*విమానాలు నిర్మించేఫాక్టరీలో పనిచేసే నలుగురు ఆపరిశ్రమను ష్వాడుచేసినందులకై అరెస్టు చేయబడి తలకొక ౧౦ఏళ్ళు కఠినవరకం విధించ

యున్నాడని తోస్తే కొంతకాలం Detention లో ఉంచి తరువాత హెచ్చరిక ఇచ్చి వదలివేస్తారు. కొంతమందిని రష్యాలోని ఉ ముఖ్య నగరాలలోనికిమాత్రం రాకుండా చేస్తారు. అతిప్రమాదకరమైన నేరాలు చేసినవారినిమాత్రం ఏ ఉత్తరధృవప్రాంతాలకో, సైబీరియాకో పంపించి వేస్తారు. యావజ్జీవశిక్ష దు సాధారణంగా ఎవ్వరికోగాని విధించరు. ఆవిధించబడినవారుకూడా తమ తప్పుల పశ్చాత్తాపం వెలిబుచ్చినట్లయితే ఓగ్పూ వారిపై నిర్బంధం తొలగించి సోవియటురష్యాకు సేవచేసి తమ పొరపాటు సర్దుకొనే అవకాశంకలిగిస్తారు.

బోల్షివికు ప్రభుత్వాన్ని కూలద్రోయడానికై ప్రయత్నించిన కుట్రదారుల్ని, ప్రభుత్వచట్టాలను ధిక్కరించిన కులకుల్ని 'కాన్సెన్ట్రేషన్'

---

బడ్డారు. కాని, ఒక్క సంవత్సరం ముగిసే లోపుగానే తాము చేసిన మంచి పనులకై ౧౦,౦౦౦రూబుళ్ళు బహుమానం పొంది పూర్వపు ఉద్యోగాల లోనే తిరిగి నియుక్తులైనారు."

(Red virtue PP. 76)

"వస్తూత్పత్తిని హెచ్చించి, మంచిరకం వస్తువులను తయారుచేసి, సోవియటుపరిభుత్వం వలన అనేక మెప్పులు పొందిన ౩౯వనెంబరు మెంఝున్స్కీ ఫ్యాక్టోరీలో పనివాండ్రుకొందరు ఆఫ్యాక్టోరీని పాడుచేసినందులకై శిక్షవిధించబడి ఓగ్పూ నిరీక్షణక్రింద మరల ఆఫ్యాక్టోరీలోనే పనిచేసి త్వరలోనే తాము పొందిన కళంకాన్ని తొలగించుకున్నారు.

"Shakhty ధ్వంసకులుగా విచారించబడి శిక్షించబడిన వారు కొంత మంది Eastern coal and metal baseలో పనిచేసి గొప్పపేరు తెచ్చుకున్నారు."

(New methods of work, and new methods of Leadership. PP. 67.)

క్యాంపులలోనికిగాని, వారికోసం ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన పారిశ్రామిక సంస్థలలోనికిగాని, పంపించి బహుకఠినంగా, బలవంతంగా పనిచేయించే వారు. వారికి ఏవిధమైన సౌకర్యాలు కలుగజేయక చావకుండామాత్రం ఇంత తిండిపడవేసేవారు. ఈ మాదిరి కాన్సెన్‌ట్రేషన్ క్యాంపులలోను, 'స్పెషల్—ఇండస్ట్రియల్ డిపో' లలోను పనిచేసే ఖైదీలనుచూసి ఓగ్పూ తనఖైదీలను చాలాకౄరంగా చూస్తూందని అనేకమంది నిందమోపేరు. ఉత్తరసముద్రద్వీపాలలోను, కెమ్—సోలోవిటుస్కీలమధ్యగల ప్రదేశం లోను అనేకవేలమంది ఖైదీలున్నారు. వీరందరూ బహుకౄరంగా హింసింపబడేవారు. ఉత్తరధృవప్రాంతాలుకావడంచేత చలి విపరీతంగా వుండేది. పైపెచ్చు జైలు ఉద్యోగులబాధలు అధికంగా ఉండేవి. ఈదురం తాలన్నీ పశ్చిమ యూరపులో ప్రచారం పొందగానే ఓగ్పూ ౧౯౩౦ లో ఆజైళ్ళను పరిశీలించడానికి ఒకకమీషనును పంపించి ఆవిషయాలు నిజమే అని గ్రహించింది. ఆ కమీషనువారి రిపోర్టును ప్రకటించలేదు కాని, ఆదురంతాలకు కారకులైన ఎంతోమంది ఓవరుసీర్లను, వార్డర్లను, కాల్చి చంపించింది. కొందరు ఉద్యోగాలునుండి తొలగించబడిరి. జైలు ఉద్యో గులంతా దూరప్రదేశాలకు బదిలీచేసివేయబడ్డారు. ఓగ్పూ యొక్క ఈ కార్యాలను పట్టే ఆజైళ్ళపరిపాలన ఎంతకౄరంగా వుండేదో తెలుస్తూంది.

౧౯౩౦ మే నెలలో ఓగ్పూ పరిపాలనావిధానంలో గొప్పమార్పు తీసుకొని రాబడింది. అది తన అధీనంలోవున్న ఖైదీలందరిచేత చేపలు పట్టించీ, అడవులు నరికించీ, కలప ఎగుమతిచేయించీ, గొప్పగొప్ప ఇంజనీరింగు పనులలో నియమించీ లాభంతీయడం ఆరంభించింది. ౧౯౩౦ తర్వాత ఖైదీలను కొట్టడం, హింస పెట్టడం పూర్తిగా మాను కుంది; పూర్వంకంటె బలకరము, శుభ్రమున్నైన తిండిని ఈయసాగింది!

రష్యా అంతటా ఈమాదిరి క్యాంపులూ, జైళ్ళూ, ఎన్నివున్నాయో సంఖ్యలు రహస్యంగా వుంచబడడంచేత మనకు తెలిసే అవకాశాలులేవు.

ఇంక ఇంజనీర్లు, స్పెషలిస్టులు, మొదలైనవారిని గురించి తెలుసుకుందాం. ఓగ్పూ అనేకమందికి బహుకఠినములైన శిక్షలు విధించింది. కొంతమందికి మరణశిక్షలూ విధించింది. కాని, వీరెవ్వరూ జైళ్ళలోనూ పెట్టబడలేదు; చంపబడనూ లేదు. అయితే వీరంతా ఏమయినారు? ఓగ్పూ కాపలాక్రింద పూర్వపు ఉద్యోగాలలోనే పని చేస్తున్నారు. ప్రభుత్వముపై కుట్రలు చేసినందులకై శిక్షలు విధించబడిన అనేకమంది స్పెషలిస్టులు, ఇంజనీర్లు మొదలగువారు పనిచేసేటందుకై ఒక పెద్ద ఇంజనీరింగు ఆఫీసు ౧౯౩౪ వరకు పనిచేసిన ఓగ్పూచేత, తరువాత దానిస్థానే వచ్చిన Norkomvuntdel చేతను కూడ నిర్వహించబడుతూంది.

ఇంత నిరంకుశంగాను, బహుక్రూరంగాను, ప్రవర్తించే ఓగ్పూ యెడల పరిశ్రమలలోను, వ్యవసాయంలోను, పనిచేసే, నూటికి 80 మంది రష్యనులకు ఏమాత్రమూ భయం వుండదు. పైగా దేశద్రోహుల్ని శిక్షించడానికి అటువంటి ప్రభుత్వశాఖ తప్పకుండా ఉండవలసినదే యని వారు చెప్పుతారు. ఓగ్పూ తన దృష్టిని ముఖ్యంగా విప్లవానికి పూర్వం జారుప్రభుత్వకాలంలో పెద్దఉద్యోగాలలో వుండి, నేడుకూడా పరిశ్రమలలోను, వాటిలోను, పనిచేసే ఇంటిలిజెన్షియా మీదనే కేంద్రీకరించింది. సోవియటు ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి కుట్రలు పన్నే విద్రోహులనే ఒకకంట కనిపెడుతూంటుంది. ఇప్పుడు కూడా ఓగ్పూ అనేకమందిని శిక్షిస్తూ వుండడానికి కారణం సోవియటు ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి ఇంకా ప్రయత్నాలు జరుగుతూ వుండడమే. ఓగ్పూ ఇంత జాగ్రత్తగా ఇంత తీవ్రంగా సోవియటు శత్రువు

లను అణచివేయకపోతే దేశంలోను, బయటగల అసంఖ్యాకులైన శత్రువులతో నిగ్రహించి సోవియటు ప్రభుత్వం ఇంతకాలం నిలువబడగలిగియుండకపోయేది. రష్యాలో ఉంటూన్న నిష్పక్షపాతులు, న్యాయమార్గస్థులు నైన రెసిడెంట్ల (విదేశీయులు) అభిప్రాయంకూడా ఇదే. ఓగ్పూను గురించి బాగా తెలిసినవాడొకరు ఈ విధంగా వ్రాసేరు.

"ఓగ్పూ ఎవ్వరినీ నిర్హేతుకంగా నిర్బంధించదు. వారు తప్పకుండా ప్రభుత్వంమీద కుట్రలు చేసే ఉంటారు. ఏకేసులోనైనాసరే శిక్షలు విధించబడితే 'ఈపని తప్పు' అని ఎవ్వరూ వేలెత్తి చూపలేరు. ముద్దాయీలు చేసినది అంత గణనీయమైన ద్రోహంకాక, వారు పశ్చాత్తాపం వెల్లడిస్తే ఓగ్పూయే వారిని వదిలిపెడుతుంది. మొత్తంమీద ఓగ్పూచేత అరెస్టుచేయబడినవారిలో అనేకులు ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి పరిశ్రమలు నాశనం చేయడానికి, తాముచేసిన కుట్రలను అంగీకరించేరు. ఓగ్పూయే లేకుంటే నేడు రష్యాలో కమ్యూనిస్టుపార్టీగాని, సోవియటు ప్రభుత్వంగాని ఉండకపోయేదే. యుద్ధసమయంలో శత్రుచారుల్ని నిర్దయగా చంపివేస్తారు. నేడు రష్యాలో జరుగుతూన్నది ఒక యుద్ధమే. అచ్చట పారిశ్రామికవర్గానికీ, పెట్టుబడిదారీవర్గానికీ పోరాటం జరుగుతూంది. అందుచేత పెట్టుబడిదారీవర్గం తరఫున పనిచేస్తూన్న గూఢచారుల్ని సోవియటుప్రభుత్వం చంపించినా తప్పు లేదు. అచ్చట ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి చేసేప్రయత్నాలు మాత్రమే మహాదోషాలుగా పరిగణించబడతాయి." *

---

* Working for the Soviets

By.—W. A. Rukeyser.

(౧౯౩౨—పుట. ౧౮౨.)

౧౨

# 'ఓగ్పూ' యొక్క నిర్మాణ కార్యక్రమం.

ఇటీవల కొన్ని సంవత్సరాలనుంచి ఓగ్పూశాఖ నిర్మాణ కార్యక్రమంలో ఎక్కువగా శ్రద్ధతీసుకుంటూంది. దేశంలోని ప్రజల ధన ప్రాణాలకి అణుమాత్రము భయంలేకుండా చేసింది. గొప్పగొప్ప పట్టణాల వీధులలో తిరిగినంత నిర్భయంగానూ, దేశంలో ఏమారుమూలనైనా తిరిగేటట్లు చేసింది. జర్జున్స్కీ జైలు పరిపాలనలో కొత్త పద్ధతులు ఏర్పాటుచేశాడు. అతని తరువాత వారుకూడా అతనిబాటనే అనుసరిస్తున్నారు.

యూ. ఎస్. ఎస్. ఆర్. లోని సాధారణపుజైళ్ళు ఆయాగ్రామాలలోని 'సోవానార్కోముల' అధికారంలోనే వుంటాయి. కాని, ఓగ్పూకు వాటిపై అధికారం వుండదు. నేటికీ జారుప్రభుత్వపునాటి కట్టడాలనే జైళ్ళుగా ఉపయోగిస్తూండడంచేత వానిలో ఆరోగ్యసౌకర్యాలు అంతగా బాగుండడంలేదు. మొత్తంమీదమాత్రం రష్యాలోని జైళ్ళ పరిపాలన

ప్రపంచం అంతటిలోకంటె అనేకరెట్లు బాగుంది. *

ఈసాధారణప్రజైళ్ల [illegible] బగ్నా [illegible] లో '[illegible]' [illegible] గని అభిప్రాయమైన [illegible] స్థాపించింది. [illegible] పనిని [illegible] వారిని మంచివారినిగా చేయడానికె ఇది [illegible]. ఆవిషయంలో బగ్నా చాలావరకు కృతార్థం అయిందికూడాను. [illegible] సుమారు ౧౦౦౦ మంది దాకా నివసించేటందుకు సౌకర్యాలున్నాయి. ౧౯౧౮ లో ఒకకోటీశ్వరునివద్దనుంచి స్వాధీనం చేసుకోబడిన పెద్దఎస్టేటులో ఇది నిర్మించబడింది.

ఇచ్చట వ్యవసాయానికి తోడు పరిశ్రమలుకూడా స్థాపించబడినాయి.

---

* P. Guiboud-Riboud అనే ఫ్రెంచివిదేశీయుడు రష్యాజైళ్ళలోని పరిస్థితుల్ని చూడదలచి R. S. F. S. R. న్యాయశాఖామంత్రిని చూసేడు. ఆనాడు న్యాయశాఖామంత్రిగావున్న Kurzky దేశీయమంత్రి నుంచి రష్యాను జైళ్ళలిస్టును తెప్పించి, Guibond నకిచ్చేడు. నిరాటంకంగా ఏవిధమైన నోటీసును ఈయకుండానే హఠాత్తుగా జైళ్ళన్నీ చూడడానికీ, అవసరం అయితే తనకు నచ్చినవానిని దుబాసీగా కూడా తీసుకొని పోవడానికీ, అతనికి లిఖితపూర్వకంగా అనుజ్ఞను ఇచ్చేడు. దానిని తీసుకొని Guiboud-Riboud అనేకజైళ్ళను చూసేడు. అనేకమంది రాజకీయఖైదీలతోటి, క్రిమినలుఖైదీలతోటి, చాలాసేపు మాటలాడేడు. ఆఖరున అన్నీచూచినాక అతను ఇచ్చిన అభిప్రాయం ఇది. "రష్యను జైళ్ళలోని ఖైదీలు మానవులుగా చూడబడుతున్నారు. ఫ్రాన్సుదేశపు జైళ్ళలోని ఖైదీలకంటె రష్యాఖైదీలు ఎన్నోరెట్లు సుఖంగా ఉంటున్నారు. ప్రపంచంలో ఎక్కడా జైలుపరిపాలన ఇంతకంటె బాగాలేదు."

దీనిచుట్టూ ప్రాకారాలుకాని. లోపలివారు పారిపోకుండా ఎట్టినిర్బంధాలు కాని లేవు. దొంగతనములు, బందిపోట్లు, వగైరా నేరాలకై రెండు మూడుసార్లు నిర్బంధించబడినవారందర్నీ ఏరుకొనివచ్చి ఈరిఫర్మేటరీ సెటిల్మెంటులో పెట్టి వారిని వ్యవసాయంలోను, పరిశ్రమలలోను నిపుణుల న్గా చేసి వారిపనికి తగిన జీతం ఇస్తూంది. వీరికి ఏవిధమైన నిర్బంధాలు లేవు. చుట్టలు త్రాగవచ్చును. తోచిన విషయాలను గురించి నిర్భయంగా మాటలాడుకోవచ్చును. నాటకాలకీ, సినీమాలకీ, పోవచ్చును. సంగీతంపాడుకో వచ్చును. తమచేతికి వచ్చే కూలితో జైలుదుకాణాలలో తమకు కావలసిన సరుకులు కొనుక్కోవచ్చును. ఇన్ని ఎందుకు? వారువిశ్రాంతివేళల ఒకహ ద్దుకులోబడి సంపూర్ణంగా స్వేచ్ఛను అనుభవించవచ్చును. ముష్టి ఎత్తుకుం టూనో, దొంగతనాలుచేసో నీచంగా బ్రతికే కంటే, ఏ వ్యవసాయ క్షేత్రంలోనో, ఏ పరిశ్రమాగారంలోనో పనిచేసుకుంటూ విశ్రాంతికాలం స్వేచ్ఛగా గడుపుకొనడంలోగల సౌఖ్యం వారికి తెలియచెప్పబడుతుంది. కొంతకాలం తరువాత ఈఖైదీలు తమ భార్యాబిడ్డల్ని తెచ్చుకొని అచ్చటనే ప్రత్యేకభాగాలలో కాపురం వుండవచ్చును. అనేకమంది ఖైదీలు తమశిక్షకాలం పూర్తియైనా ఇచ్చటనే స్థిరనివాసం ఏర్పాటుచేసుకొని ఎవ్వ తనో ఒకరితను పెండ్లిచేసుకొని సుఖంగా కాలక్షేపం చేస్తున్నారు. ఈవిధంగా ఇక్కడ శిక్షపరిమితి పూర్తిచేసుకున్నవారి సంఖ్య క్రమంగా పెరుగుతూ ౧౯౩౪ నాటికి ౩౦౦౦ దాటింది. వీరిలో రష్యా నాలుగు మూలల నుండీవచ్చిన వేరువేరు జాతులవారున్నారు. యు.ఎస్.ఎస్.ఆర్. లోఉన్నది ఈమాదిరి జైలు ఇది ఒక్కటేకాదు. ఇటువంటివి దేశం మొత్తంమీద ౧౦ ఉన్నాయి. *

* ఈ 'బోల్షివో రిఫర్మేటరీ సెటిల్మెంటు' మాస్కోకు ౨౦ మైళ్ళ దూరంలో వుంది. "సాధారణంగా మనుష్యులకుగల సాంఘిక ఆర్థిక

యు. ఎస్. ఎస్. ఆర్. ను అంతను పీడిస్తూన్న గడ్డుసమస్య ఏదయినా వుంటే అది ఓ.గ్పూ పరం చేస్తారు. ౧౯౧౭ మొదలు యుద్ధంవలన, కరువులవలన, అనేకలక్షలమంది 'నా'యనేవారులేక అనాథలై అల్లాడిపోతున్నారు. వీరందరినీ తగు సంరక్షణలోవుంచి, పని నేర్పి, దారిలోపెట్టడం కోసం, మహాసమర్థుడు, ఆదర్శపురుషుడు, ఓగ్పూ ప్రధానాధికారియునగు ఝర్జన్స్కీని నియమించేరు. దీనికోసం ప్రభుత్వం ఒక కమీషనును నియమించి దానికి జర్జున్స్కీని ప్రెసిడెంటును చేసేరు. దేశం నలుమూలలా వ్యాపించియున్న ఓగ్పూ అధికారులనే ఈసమస్యాపరిష్కారానికి ఝర్జన్స్కీ నియమించేడు. ఈకమీషను దేశం అంతటా అనాథశరణాలయాలు స్థాపించి ౮ ఏండ్లలో అనేకలక్షలమంది అనాథల్ని పట్టుకొని తగిన తరిఫీదునిచ్చి, దేశంలో విజృంభిస్తూన్న పరిశ్రమలలో పనులనిప్పించి, ఈసమస్యను సంపూర్ణంగా పరిష్కరించింది.

ఇంతే కాకుండా ఓగ్పూ తన పంచాయతీలద్వారా విప్లవప్రతికూల చర్యలకై శిక్షలు విధించబడిన టెక్నీషియనులచేత, ఇంజనీర్లచేత, వంతెనలు-ఫ్యాక్టొరీలు-ఇండ్లు-మొదలయినవి నిర్మింపచేసేరు. ఈవిధములైన పనులలో నియమించబడినవారి సంఖ్యలు మనకి సరిగా తెలియవు. పరిశ్రమలలో పనిచేసేవారంతా ఓగ్పూ కాపలాలో ప్రత్యేకపుటిండ్లలో ఉంచబడతారు. ౧౯౩౧లో జరిగిన పరిశ్రమలలోని కుట్రదారులలో ముఖ్యుడైన ప్రొఫెసరు 'రాంజిన్' తన శిక్షాకాలము నంతను అనేకపరిశ్రమాగారా

---

విషయాలలోని చిక్కులవలననే దొంగతనాలు, హత్యలు, మొదలైనవి జరుగుతూంటాయి. కనుక వారిని ఆపరిస్థితులలోనుంచి తప్పించి, జీవనాధారమునకు తగు గతి కల్పించి, జీవితములోరుచి చూపిస్తే దొంగతనాలు, ఖూనీలు, చేయడం వారే మానివేస్తారు." అనే సూత్రంమీదనే ఈరిఫర్మేటరీలు ఏర్పరచబడినాయి.

లకీ సలహాల నీయడంలోనే గడిపివేశాడు. ఆతడు తనశిక్షాకాలంలో ప్రథమ సంవత్సరం 'ఎలక్ట్రోసిలా' కర్మాగారంలో పనిచేశాడు. యుద్ధానికి ముందు ఆకర్మాగారపు డైరెక్టరులలో ఒకడైన 'క్రాసిన్' నివసించిన భవనమే 'రాంజిన్'కు కూడా ఈయబడింది. ట్రస్టులలో పనిచేసిన కూలీలకు పూర్తిజీతాలు వసూలు చేసి వానిలో కొంతభాగం మాత్రమే ఖైదీలకిస్తుంది. ఓగ్పూ జైళ్ళని సంస్కరించడం, అనాథశిశువుల్ని జాగ్రత్త పెట్టడం, ఇంగ్లాండు, అమెరికాలలో, కూడా చేస్తున్నారు. కాని, రష్యాలోని విధానం చూసి వారంతా పాఠం నేర్చుకోవలసి యుంటుంది.

౧౯౩౧-౩౩లో తెల్లసముద్రం నుంచి లెనిన్‌గ్రాడ్‌వరకు పెద్దకాలువను త్రవ్వించవలసి ఆధారమునంతను, కంట్రాక్టర్లకుగాని. గొప్పగొప్పకట్టడాలను కట్టే ఇతరట్రస్టులకుగాని, ప్రభుత్వశాఖలకుగాని, ఈయక సోవియట్‌ప్రభుత్వం ఓగ్పూకే ఇచ్చింది. ఈకాలువ త్రవ్వడానికి రోజుకి రెండులక్షలమందివరకు కూలీలు పనిచేసేరు. వీరిలో చాలమంది సాధారణకోర్టులవలన ఖూనీలకు, దొంగతనాలకు, శిక్షింపబడినవారే విప్లవ ప్రతికూలురైనందుకై ఓగ్పూ కోర్టులవలన శిక్షించబడిన టెక్నిషియనులు, ఇంజనీర్లు, ఆస్తులు లాగుకొనబడి గ్రామాలనుంచి తరుమబడిన కులకులు కూడ అనేకపనులకి నియమించబడ్డారు. అనేకతరహాలకు చెందిన ఈకూలీలంతా బంటాలుగాను, దళములుగాను, విభజింపబడి, మేస్త్రీలు— ఇంజనీర్ల—ఆధిపత్యాన పనిచేసేరు. కూలీలు— మేస్త్రీలు లగాయతు ఇంజనీర్లవరకు అందరు యోగ్యతలనుబట్టి ఉన్నతపదవులకు తీసుకొనబడేవారు. వీరికి కావలసిన బసల సదుపాయాలు, తిండి సదుపాయాలు, వైద్యసహాయము సైనికదళాలకిచ్చినట్లుగానే ఓగ్పూ ఇచ్చింది. సైనికదళాల మాదిరిగానే వీరుకూడా ఒకచోట పని పూర్తికాగానే వేరొకచోటికి పంపించబడుతూ వుండేవారు. కాని, వీరు సైనికులవలె తిని

కూర్చుండక శ్రమపడి పనిచేస్తూండేవారు. ఇంతసేపటిలో ఏదళం ఎక్కువ దూరం త్రవ్వగలదో, ఏదళం ఎంతగోతి కదలాలో, ఏదళం ఎక్కువ దూరం రైలుదారి వేస్తుందో, అని ఒకరిపైనొకరు పోటీగా తీవ్రంగా పనిచేసేరు. వీనికి కారణం మరేమీ కాదు. పనియొక్క ఉత్కృష్టత పని వారికి బాగా తెలియచెప్పడమే. ౧౯౩౩వసంవత్సరం ఆగస్టునెల ౬వ తేదీన Moscow Daily News అనేపత్రికలో గోర్కీ ఈవిధంగా వ్రాసేడు. "అనేకసంవత్సరాలనుంచి సాధారణకారాగారాలలోను. ఓగ్పూజైళ్లలోను ఖూనీనేరాలకీ, దొంగతనాలకీ, శిక్షలననుభవిస్తూన్న వారిలోనుంచి వేల కొలది నేర్పరులగు పనివారు తయారయినారు. ౧౦౦మందికి పైగా వ్యవసాయనిపుణులు ఎంతోమంది టెక్నీషియనులు, ఫిజిషియనులు, ఇంజనీర్లు, తయారయినారు. పెట్టుబడిదారీదేశాలలో ఎక్కడా ఇటువంటిపని సాధ్యపడలేదు. మానవసమాజంయొక్క శాంతి—భద్రతలకు శత్రువులుగా ఎంచబడే వీరంతా బాల్టిక్—తెల్లసముద్రాల్ని కలిపే కాలువను నిర్మించ డంలో ఎటువంటి సామర్థ్యం చూపించేరు? సోమరిపోతులు, కుట్ర దారులు, బందిపోటుదొంగలు నగు వీరికి చేసే ఉపదేశం ఇదే. "ఇప్పుడు బాల్టిక్—తెల్లసముద్రాలను ఒక కాలువద్వారా కలుప వలసి యుంది. ఆపనిలో మీరు మహారణ్యాలు ఛేదించాలి. ఊబినేలలు బాగు చేయాలి. కొండలు అడ్డంవస్తే తవ్వివేయాలి. నదుల మార్గాన్ని మార్చ వలసి యుంటుంది. పెద్దపెద్ద లాకులు కట్టవలసియుంటుంది. ఒక్కొక్క చోట ౧౦౩గజాల ఎత్తుదాకా నీటిని తీసుకురావలసియుంటుంది. ౧౪౨మైళ్ల పొడవుగల ఆకాలవను త్రవ్వడానికి ఇంచుమించు ౩కోట్ల ఘనగజాల మట్టిని త్రవ్విపోయవలసి యుంటుంది. ఈపనిని మీరు సాధ్యమైనంత తక్కువ కాలంలో ముగించాలి. మీకు శుభ్రమైన బట్టలిస్తాము, బలకర మైన ఆహారం ఇస్తాము. ఆరోగ్యకరములయిన బారకీసుల నిస్తాము.

సినీమాలు—క్లబ్బులు ఏర్పరుస్తాము. ఇంతకంటె ఎక్కువ సౌకర్యాల నీయలేము. బాగాపనిచేసి మీఅర్హతలను తెలియపరచుకొనండి."

ఈకూలీలంతా సాంఘికంగా వేర్వేరు తరగతులకు చెందినవారు కావడంచేత వారందరి మనస్తత్వాలు ఒకేమాదిరిగా ఉండవు. ఓగ్పూ శిక్షణాశిబిరాలలో ఖైదీలకి చదవడం—వ్రాయడమే గాక రాజకీయపరిజ్ఞానంకూడా కలుగచేస్తుంది. స్వాభావికంగా మానవుడు తెలివితేటలు గలవాడే. మూఢులు ఎక్కడనోగాని ఉండరు. కాని, ప్రస్తుతపు పెట్టుబడిదారీవిధానమందుగల లోపంచేత అనేకమంది తెలివితేటలున్నా అవకాశాలు లేక మూఢత్వంలో మునిగిపోతున్నారు. ఓగ్పూ చేసిన ఈపరిశ్రమ వలన ఈకూలీలలో వేలకొలదిమంది తమబాధ్యతను, తమపనియొక్క గొప్పతనాన్నీ, గుర్తించి పనిచేసేరు. మహావేగంగా ప్రవహించే నదులు, కరేలియా ప్రాంతంలోని ఊబినేలలు, మహారణ్యాలు, పెద్దపెద్దచట్రాళ్లు ఎన్నింటినో తవ్వవలసివచ్చింది.

ఈపనియంతా పూర్తి అయినాక దీనియందు ఏమయినా లోపాలున్నవేమోనని అతికచ్చితంగా సరిచూడబడింది. గొప్పగొప్పఓడల రాకపోకలకి ఉపయోగించే ఈకాలవ అనుకున్నకంటె తక్కువ కాలంలో కూలికి—సామానులకి అంచనా వేయబడిన దానికంటె తక్కువ సొమ్ముతో తయారయింది. సోవియటుప్రభుత్వం ఈకాలువను తెరచుసమయంలో డైరెక్టింగ్—సూపరింటెండెంటుకు, ఆయనక్రింద పనిచేసిన ఇంజనీర్లకు, అత్యుత్సాహంతో తమశక్తికి మించి పరిశ్రమచేసిన అనేకమంది ఖైదీకూలీలకు ఒకేరకపు పతకాలు బహుమానం చేసింది. బాగా పనిచేసిన అనేకవందలమంది కూలీలకు ధనరూపంగా బహుమానాలు పంచిపెట్టింది. ౧౨౫౦౦ గురి శిక్షలు పూర్తిగా రద్దుచేయబడి, దేశం అంతటా కూలీలు చాలక ఇబ్బంది పడుతూన్న పరిశ్రమాగారాలలో చేర్చుకోబడ్డారు.

౧౯౨౧-౨౨ గురి శిక్షలు రద్దుచేసివేయబడినాయి. ఒకగొప్పనిర్మాణాన్ని తలపెట్టి దిగ్విజయంగా నెరవేర్చడమే కాకుండా దొంగలను, హంతకులను సుశిక్షితులగు పౌరులనుగా తయారుచేసిన ఓగ్పూశాఖను సోవియటు ప్రభుత్వం హృదయపూర్వకంగా అభినందించింది.

ప్రపంచం అంతటా ఓగ్పూ చాలా నిరంకుశమైనదనీ, హానికరమైన దనీ, ఒకవాడుక పడిపోయింది. విషయాలు తెలియక పోవడంచేత అందులో నిజానిజాలు మనం చెప్పలేము. అటువంటిసమయంలో దేశీయాంగశాఖగా మార్చబడిన (౧౯౩౪) ఓగ్పూను గురించి మనం విమర్శించబోవడం సాహసకృత్యమే. కాని, నేడు దేశంలో చాలా విషయాలలో అభివృద్ధికనిపిస్తూంది. క్రమంగా సోవియటుప్రభుత్వం స్థిరపడింది. ఒకప్పుడు విద్రోహకృత్యాలలో పాల్గొన్నా భయంచేతనో, లాభంలేదనో ఆకుట్రలనుంచి విరమించుకొన్నవారిని బోల్షివికులు ఇబ్బందిపెట్టడమూ మానివేశారు. కమ్యూనిస్టుసిద్ధాంతాలను ఒప్పుకొననివారుకూడా సోవియటు ప్రభుత్వముయొక్క పటుత్వము—స్థిరత్వము, చూచి దానియందు నమ్మకం వుంచి తమ యోగ్యతలకు తగిన పదవులపొంది సంతృప్తితో కాలక్షేపం చేస్తున్నారు.

మెన్షవికులు, సోషల్—రివొల్యూషనరీలు, అరాడ్వాదులు, స్రమాడ్వాదులు మొదలగువారిని దొంగలు— దారిదోపిడిగాండ్రతోటి సమంగా చూడడం హర్షించతగినదికాదు. సాధారణఖైదీల చిత్తవృత్తుల నేలాగైనా మార్చవచ్చు. గాని, రాజకీయశత్రువుల అభిప్రాయాలు మార్చడం దుర్ఘటం అని నిశ్చయించి బోల్షివికులు శత్రువులను ఖైదులలోపెట్టి విదేశాలకు తరిమివేసి, చంపేసి, నాశనం చేసివేశారు. ఈకారణం చేతనే అంతర్యుద్ధసమయంలో బోల్షివికులు—శ్వేతసైన్యాలు (Whites) ఒకరినొకరు నిర్దయగా చంపుకున్నారు. అంతర్యుద్ధం అంతటా అయినాక

కూడా కమ్యూనిస్టులు ఓగ్పూశాఖద్వారా సోవియటుశత్రువులుగా ఎంచ బడిన intlligentia ను మారణహోమం చేయించింది. నేడు ఈరెండువర్గాలకి పరస్పరంగల అనుమానం, క్రోధం తగ్గిపోతున్నాయి.

ఈమధ్యనే ఒకబోల్షివిక వ్రాసిన విషయం చదివితీరవలసి యుంది. "మానవస్వభావం ఆతను పెరిగిన పరిసరాలను పట్టి ఏర్పడు తుంది. కనుక ఆస్వభావంలో మార్పుతేవాలంటే పరిసరాలను మార్పు చేయాలి. కాని, శిక్షిస్తే ప్రయోజనం ఉండదు. ఆకారణం చేతనే మెన్ష విక్కులను, సోషల్—రివొల్యూషనరీలను మొదలయిన రాజకీయఖైదీ లను సాధారణఖైదీలతో సమంగానే చూస్తూన్నారు." ౧౯౩౩ లో విప్లవప్రతికూలనేరం క్రింద ౧౦ ఏండ్లు శిక్ష విధించబడిన ఒకరాజకీయ ఖైదీ ఈవిధంగా వ్రాసేడు. "కెరీలియన్ అడవులలో ఈకారకీములలో నివసించడం ఆరంభించిన తర్వాతనే పనిచేయడంలోగల సౌఖ్యం నాకు బోధపడింది. పనియొక్క అర్థంతెలిసిన కూలీలచేత పనిపుచ్చుకొనడంలో గల సుఖంకూడా తెలుసుకున్నాను. తమకు గల హక్కులు సౌక ర్యాలు, గౌరవము, ఆస్తి—పాస్తులు పోగొట్టుకొనిన వారిచేత సమా జాభివృద్ధికరములగు పనులుచేయించి వారి పూర్వపుగౌరవప్రపత్తుల్ని తిరిగి ఈయడం అనేది నిజంగా గొప్ప ఆలోచన. ఏమీ సందేహంలేదు. ఈపద్ధతివలన అనేకవేలమంది శరీరం వంచి బాగుగా పనిచేసి శిక్షాకాలం పూర్తికాకుండానే స్వాతంత్ర్యం పొందేరు. రష్యను ప్రజాసామాన్యం చేత ద్రోహులుగా పరిగణించబడి ప్రవాసాలకు పంపబడిన కులకులు ఎంతకష్టపడి పనిచేసేరు! ఒక ఉదాహరణం 'పాడ్లిన్స్కిబంటాలో' ౩౭ రు కులకులు ఉన్నారు. వీరు మట్టిత్రవ్వి బయటపోయడంలో సాధారణంగా చేసేపనికి రెండున్నర రెట్లు ఎక్కువపనిచేసి, ఆపనిలో రికార్డు స్థాపించేరు. వారు పనిచేయవలసిన కాలం పూర్తియైన క్రొత్త

బంటూ వారిస్థానంలో పనిచేయడానికి వచ్చినా చోటువిడువక పనిచేస్తూ వెళ్ళడానికి నిరాకరించేరు. అప్పుడు ప్రత్యేకంగా సూపరింటెండెంటు వద్దనుంచి ఆజ్ఞతెచ్చి వారిచేత ఆపని మానిపించవలసివచ్చింది." *

పెద్దపెద్దనగరాలలోనికి ముఖ్యంగా మాస్కో-లోనికి దొంగలూ, బందిపోట్లు, హంతకులూ, విప్లవవ్యతిరేకులు, నిరుద్యోగులు, మొదలగువారు చేరకుండా చేయడానికై జారు ప్రభుత్వకాలంలో వుండే Pass-Port విధానం తిరిగి అమలులో పెట్టబడింది. U. S. S. R. లోని Council of People's Commissars చేత ఈవిధానం దేశం అంతటా అవలంబింపచేయబడింది. ౧౬ సంవత్సరాలు దాటిన ప్రతిపౌరుడు Pass-Port కలిగియుండి తీరాలి. ఇది లేనివారెవ్వరినీ ఏపట్టణములోనికీ రానీయరు. ఫాక్టోరీలు, రైల్వేలు మొదలగువాటిలో ఎక్కడా పని ఈయరు. ఈవిధానము నంతను సక్రమముగా నడిపించడానికై ఓగ్పూలో ప్రత్యేకశాఖ ఏర్పాటుచేయబడింది. దీనికి జి. ఇ. ప్రొకోఫీవు అధ్యక్షుడుగా నియమించబడ్డాడు. ఈశాఖకు రిపబ్లికు లన్నిటియందు గల కూలీ-రైతు Millitia పై అధికారం కలిగియుంటుంది రిపబ్లికులలోని Millitia లకు కావలసిన మనుష్యుల్ని తరిఫీదుచేసి సప్లయి చేస్తూంటుంది. దానికి సంబధించిన శాసనాలను Council of People's Commissars ఎదుట పెడుతూంటుంది. పైమిలిటియాకుగల అధికారాన్ని గురించీ, దాని కార్యప్రణాళికను గురించీ ౧౯౩౧ మే ౨౫ న చేయబడిన చట్టమే లేకుంటే అది సర్వస్వతంత్రములుగల సంస్థగానే ఉండియుండేది.

మొత్తంమీద ఈ ఓగ్పూశాఖ సోవియటుశత్రువుల్ని నిర్మూలించ

---

* Mascow Daily News.
౧౪ August ౧౯౩౩.

డానికే ఏర్పరచబడినా, దుర్మార్గులను మంచి దారిలోనికి తెచ్చి, గొప్ప సాంఘికసేవ చేసి, ఖైదీలచేత ప్రపంచం ఎన్నడూ కనివిని ఎరగనంత గొప్ప ఇంజనీరింగు పనులు చేయించి, కట్టడములు కట్టించి, సోవియటు శత్రువులయెడ చూపిన క్రౌర్యాన్ని మరపించింది.*

---

* యూ.ఎస్.ఎస్.ఆర్.లో చాలాకాలంనుంచి నివసిస్తూన్న ఒక అమెరికాదేశీయుడు ఈవిధంగా వ్రాసేడు.

"అంతర్యుద్ధకాలంలో - 'ఛెకా' చేత ప్రతిఏటా - కొన్ని వేలమంది కాల్చిచంపబడ్డారు. కాని, ఓగ్పూవలన శిక్షించబడినవారి సంఖ్య చాలా కొద్దిమాత్రమే."

Soviet Russia
— W.H. Chamberlin.

౧౭కోట్ల జనసంఖ్యగల సోవియటురష్యాలో ఈమాత్రపు మరణ దండనలు ఒకలెక్కలోవి కావు. గొప్పగొప్ప నాగరికజాతులమంటూ విర్రవీగే జర్మనీ-ఇటలీలు ఇంతకంటె తక్కువ జనసంఖ్య గలిగియున్నా ఇంతకు అనేకరెట్లు ఎక్కువగ మరణదండనలు విధించి అమలు జరుపుతూన్నాయి.

## ౧౮

# సోవియటు యూనియన్

## (U. S. S. R.) ప్రాక్యురేటరు.

౧౯౩౩లో ముఖ్యమైన శాఖయొకటి నూతనంగా ఏర్పాటుచేయబడింది. 'అకులోవ్' అను నాతడు ఈశాఖకు ప్రొక్యురేటరుగా నియమించబడ్డాడు. ఈతడు ౧౯౦౦మొదలు లెనినుతో పనిచేసిన గొప్పవిప్లవకారుడు. కొంతకాలం ఓగ్పూకమీషనుకు ఉపాధ్యక్షుడుగా పనిచేసేడు. ౧౯౩౧లో ఒక తక్కువ ఉద్యోగంలోకి మార్చబడి డానిట్జి—బేసిన్‌కు పంపబడ్డాడు. ౧౯౩౩జూలై నెలలో యూ.ఎస్.ఎస్.ఆర్.కు ప్రొక్యురేటరుగా నియమించబడినాడు. ఓగ్పూశాఖయొక్క పనులను కనిపెట్టిచూస్తూండడానికే ఈశాఖ నూతనంగా సృష్టించబడింది. దేశంలోని బోల్షివికుశత్రువుల దౌర్జన్యాలు, సంఖ్యాబలము కూడ క్షీణించడంచేత ఓగ్పూయొక్క క్రౌర్యం, నిరంకుశత్వం, ఇంకనుండి తగ్గించవచ్చునని సెంట్రలు ఎగ్జిక్యూటివు సభ్యులకు తోచడంచేత ఈశాఖను నియమించేరు. మరుపటిసంవత్సరమే ఓగ్పూ "దేశీయాంగశాఖ"గా పరివర్తనం పొందింది. దానికి 'యగోడా'ను కమిస్సారుగా నియమించి యూ.ఎస్.ఎస్.ఆర్.యొక్క 'సోవనార్కం'లో ఒకస్థానం ఇచ్చేరు.

# విప్లవ త్రయం.

ఇంతవరకు మనం చదివినది అంతా సోవియటుకమ్యూనిజం యొక్క విధ్వంసకవిధానాన్ని గురించే. పెట్టుబడిదారీపద్ధతులవలన ప్రజల యొక్క మానసికప్రవృత్తులు చాలాసంకుచితములై అవినీతికరములైన మార్గాల నవలంబించేయి. అటువంటి వాతావరణంలో పెరిగిన ప్రజా సామాన్యాన్ని అతివిశాలము, సామాన్యప్రజానుకూలము నైన కమ్యూనిస్టుసమాజంలోకి తీసుకురావాలంటే పూర్వపు సామాజికనిర్బంధాలనన్నిటిని సంపూర్ణంగా ధ్వంసం చేయక తప్పదు. సోవియటురష్యాలో, పెట్టుబడిదారీవిధానసమయంలో సంకుచితములైపోయిన ప్రజల చిత్తవృత్తులన్నీ మారిపోయి సంపూర్ణంగా కమ్యూనిస్టుసమాజం ఏర్పడేదాకా బోల్షివికులు తమ నిర్బంధవిధానాన్ని మానరు.

రష్యావిప్లవానికి ఇతరదేశాలలోని విప్లవాలకు—అందులో ముఖ్యంగా ఇంగ్లాండులోని విప్లవానికి గల తారతమ్యం కొంచెం

ఉల్లేఖించి దీనిని ఇంతటితో ముగించివేస్తాం.

రష్యాలో ౧౯౧౭లో ప్రారంభమైన విప్లవం నేటివరకు నిరంతరాయంగా సాగుతూనే వుంది. ఈవిప్లవంలో మూడు వేరువేరు విప్లవాలు అంతర్లీనములై యున్నాయి. ఇతరపాశ్చాత్యదేశాలలో ఈమూడువిప్లవాలు రావడానికి ౧౬-మొదలు ౨౦వశతాబ్దం వరకు మొత్తం నాలుగు శతాబ్దాలు కాలం పట్టింది. వేర్వేరు మతస్థులు తమతమ మతాభిప్రాయాలను బలవంతంగా ఇతరుల నెత్తిన రుద్దడంతో ఆరంభమైన పోరాటాలు అన్నిమతాలూ ఒక్కటే అనే సిద్ధాంతంలోనికి వచ్చి గొప్పమతవిప్లవాన్ని తెచ్చిపెట్టినాయి. దానివెనుక చేతిపనులను ధ్వంసం చేసి వాటిస్థానే యంత్రపరిశ్రమలను స్థాపించడంతో రెండవదగు పారిశ్రామికవిప్లవం పూర్తి అయింది. ఈపారిశ్రామికవిప్లవం తరువాత నిరంకుశప్రభువుల ఏకాధికారాన్ని నిర్మూలించి దానిస్థానే ప్రజాధికారం స్థాపించబడడానికి చిరకాలం పోరాటాలు సాగి చివరకు ఆరాజకీయవిప్లవం కూడా సఫలం అయింది. కాని, రష్యాలో మాత్రం ఈమత-పారిశ్రామిక-రాజకీయ-విప్లవాలు మూడూ ఒకేసమయంలో ఆరంభమై ఇంతవరకు ఏదేశంలోను జరిగియుండనంత స్వల్పకాలంలో సంపూర్ణంగా విజయాన్ని పొందేయి. సాధారణంగా ఒకవిధానంలో మార్పు కలగాలంటే కొన్నిశతాబ్దాలకాలం కూడా అధికం అనిపించదు. కాని, సోవియటురష్యాలోమాత్రం ౨౦ ఏండ్లలో ప్రజలయొక్క పూర్వపు ఆచారవ్యవహారాలన్నీ సమూలంగా తారుమారై నూతనవిధానాలు ఏర్పాటుచేయబడినాయి. రెండు రైతువిప్లవాలతో ఆంతవరకు జమీందార్ల చేతులలోవుండి ప్రజలు తిండికికూడా పండించుకుంటుకు వీలులేకుండా బంజరుపడియున్న భూములన్నీ సమాజంయొక్క స్వాధీనంలోకివచ్చి, ఆధునికయంత్రాలతో సేద్యంచేయబడి, ఆహారపదార్థాల ఉత్పత్తి విపరీతంగా పెరిగింది. మొత్తంమీద ప్రపంచ-

మంతటియొక్క ఆరవభాగంలో పెట్టుబడిదారుల నిరంకుశత్వం నిర్మూలించబడి శ్రామికవర్గం యొక్క నిరంకుశత్వం స్థాపించబడింది. రష్యా విప్లవంలో వర్గకలహసిద్ధాంతం తీవ్రరూపం ధరించింది. సామాజికబంధనాలు సర్వం నామరూపాలుకూడా లేకుండా చేసివేయబడినాయి. ప్రజలు హద్దులేని బాధలు అనుభవించేరు. నిజమే. కాని, ఎలిజబెతుకాలంలో వచ్చిన సంస్కరణాలుకాని, మూడవజార్జికాలంలో వచ్చిన పారిశ్రామిక విప్లవంకాని, ౧౬౪౦—౧౬౮౯లమధ్య రాజ్యాంగాధికారంకోసం ఇగ్లాండు ప్రజలకీ—రాజుకీ జరిగిన పోరాటంలోకాని, రష్యావిప్లవసమయంలో ఏర్పడినంత తీవ్రపరిస్థితులు ఏర్పడలేదు. దీనికి కారణం పైవిప్లవాలు మూడు ఇంగ్లాండులో నాల్గుశతాబ్దాలలో నెమ్మదిగా క్రమక్రమంగా రావడమే. రష్యాలో ఒకేమారు ఆరంభమైన ఈమూడువిప్లవాలు ౫౦ఏళ్ళలో ఇంగ్లాండులో ౪౦౦ఏళ్లలోకూడా తేలేని మార్పుని తెచ్చివేసినాయి. ఇంగ్లండులోనినాలుగుకోట్ల ప్రజలు ఒకే జాతికి చెందిన నాగరికులు. కాని, రష్యాలోని ౧౬కోట్లమంది లో అనేకజాతులున్నాయి. నాగరికులు ఉన్నారు. అనాగరికులు ఉన్నారు. ప్రపంచంలోని ఏదేశప్రజలు రష్యాలోని జనంవలె ఒకేసారి బహుస్వల్పకాలంలో సంపూర్ణంగా మార్పు పొందియుండలేదు. ఈవిప్లవాలవలన, అంతర్యుద్ధంవలన, విదేశీయుల దండయాత్రలవలన ఆదేశీయు లెన్ని కష్టాలు పడ్డారో, ఎంతమంది నాశనం అయినారో ఊహించడం కష్టం. విదేశీయుల దండయాత్రలు, అంతర్యుద్ధాలు, లేకపోయినా ఒకదానివెనుక ఒకటిగా వచ్చిన ఈమూడువిప్లవాలు కారణంగా ఆనాల్గుశతాబ్దాలలోను ఇంగ్లండులో మరణించినవారి సంఖ్యలు చెప్పడం కూడా అసంభవమే. రష్యాజనసంఖ్యలో నూటికి పదిమందికి మించని మతాచార్యులు, జమీందారులు, పెట్టుబడిదారులు, జారుప్రభుత్వోద్యోగులు మొదలైనవారు బీదప్రజల శ్రమశక్తుల్ని దోచుకుంటున్నారనే అభిప్రా

యంతో బోల్షివికులు వారికి వోటింగు అధికారం లేకుండా చేసేరు. సోవి యట్లు, పరపతిసంఘాలు, ట్రేడ్‌యూనియన్లు మొదలగువానిలో చేర కుండా నిషేధించేరు. కాని ప్రొటెస్టెంటుమత మవలంబించిన బ్రిటిషు ప్రభువు ౩౦౦సంవత్సరాలపాటు రోమన్ కేథలిక్కుగురువుల్నేకాక, ఆమ తాన్ని అభిమానించే ప్రతిబ్రిటిషుపౌరుడికీ వోటింగు అధికారం రద్దుచేసి నాడు. వారికి ఉద్యోగాలీయక నానావిధాల హింసించి అనంతమైన క్రోధాన్ని వెలిబుచ్చినాడు. ఒక్క రోమనుకేథలిక్కులే కాదు. ప్రొటె స్టెంటులు కాని వారెవ్వరు ప్రజాప్రతినిధిసభలలోనికి మ్యునిసిపాలిటీలలో నికికూడా అడుగు పెట్టనీయబడలేదు. పాఠశాలలో చదువుకొనడానికి కూడా నిషేధించబడ్డారు. వారిసంతతి ప్రాథమికపాఠశాలలలోనికి కూడా రానీయబడలేదు. ఈనిషేధాలన్నీ ౨౦వశతాబ్దారంభంవరకు ఇంగ్లండులో కొద్దో–గొప్పో ఉంటూనే వచ్చేయి.

౧౯౧౭లో బోల్షివికులు అధికారంలోకి వచ్చిననాటినుంచీ రష్యాను గొప్పపారిశ్రామికదేశమునుగా తయారుచేయడానికి, వ్యవసా యాన్నికూడా యంత్రసహాయంతో బ్రహ్మాండంగా నడిపించడానికి తీవ్ర ప్రయత్నాలు చేసేరు. ఆకారణంచేత చేతిపనులు నశించేయి. చిన్నచిన్న భూఖండాలన్నీ ఏకం చేయబడి పెద్దపెద్ద సమిష్టివ్యవసాయక్షేత్రాలు ఏర్ప రచబడ్డాయి. ఆసమిష్టికృషిక్షేత్రనిర్మాణానికి అడ్డుతగిలిన అనేకలక్షల మంది ఆస్తులు ప్రభుత్వానికి దఖలు పడిపోయినాయి. అనేకవేలమంది ప్రవాసాలకి పంపివేయబడ్డారు.

౧౭౦౦–౧౮౫౦ ల మధ్య ఇంగ్లాండు దేశంలో కలిగిన పారి శ్రామిక విప్లవం కారణంగా చేతిపనులమీద జీవించే లక్షలకొలది ప్రజలు దరిద్రులై పరిశ్రమలలో కూలీలుగా చేరిపోవలసివచ్చింది. ఈవిధంగానే కొందరు ధనికులు వ్యవసాయంలో కూడా యంత్రాలను ప్రవేశపెట్టడం

వలన చిన్నచిన్న వ్యవసాయదారులంతా కూడా తమవ్యవసాయము మానుకొని పరిశ్రమలలో కూలిపనికే ఎగపడవలసి వచ్చింది. 'మాంచెస్టర్' మొదలైన పారిశ్రామికకేంద్రాలలో వేలకొలది బాలురు బానిసల కంటె హీనమైన స్థితిలో పనిచేస్తూన్నారు. మిల్లుయజమానులు అనాథ శిశువుల్ని వేలకొలదిమందిని కొని తమ మిల్లులలో పనిచేయించుకొంటు న్నారు. బొగ్గుగనులలో బట్టలుకూడా పూర్తిగాలేని బాలురు-బాలికలు చాకిరీ చేస్తున్నారు. ముసలితనంచేతగాని, మరి ఏయితరకారణాలచేతగాని పనిచేయలేనివాళ్ళకి 'పెన్షను' కూడా ఈయకుండా పనులలోనుంచి తగిలి వేస్తున్నారు. పెట్టుబడిదారుల అజాగ్రత్తవలన యంత్రాగారాలలో అనేక మందికి ప్రాణాపాయాలు కలుగుతున్నాయి. పారిశ్రామికకేంద్రము లందలి అనారోగ్యపరిస్థితులు కారణంగా కూలీల జీవితపరిమాణం క్రమంగా క్షీణించిపోతూంది. ౧౮౩౨ లో బ్రిటిషురాజ్యాంగవిధాన ములో కొన్నిమార్పులు చేయబడ్డాయి. ఈమార్పులు కారణంగా రాజ్యాంగ యంత్రం పెట్టుబడిదారులకి స్వాధీనం అయిపోయింది. కాని నూటికి ౯౦ మందికి పైగాగల సాధారణప్రజకి గలిగిన స్వాతంత్ర్యం ఏమి లేదు. సరిగదా. 'వెస్టుమినిస్టరు' ప్రాంతములందలి చేతిపనివారు తమకుగల వోటింగు హక్కును కూడా పోగొట్టుకున్నారు. ఇంగ్లాండులో 'ఒక్రానా' 'ఛెకా' 'ఓగ్పూ'ల తో పనిలేకుండానే వ్యవహారాలు జరిగిపోతున్నాయి. ౧౮-౧౯ శతాబ్దాలలో పెట్టుబడిదారీవర్గానికి అనుకూలురుగావున్న జడ్జీలు, మ్యాజిస్ట్రేట్లు ఏవోసందిగ్ధంగా వున్న చట్టాలనుచాటుచేసికొని పెట్టుబడి దారీవర్గానికి అసంతృప్తిగలిగించే ట్రేడుయూనియనిస్టుల్ని, సమ్మె దారుల్ని, ప్రజాసామాన్యముయొక్క కోరికల్ని వెల్లడించే పత్రికల నమ్మేవారిని, విరుద్యోగుల్ని, నాస్తికుల్ని, చట్టముల నతిక్రమించే రనే పేరుతో అణచిపారవేసేవారు. ఈ ౨౦ వ శతాబ్దంలో కూడా

ఇంగ్లండులో అతీవ్రనిష్పంథవిధానం నడలలేదు.

మేము మాస్కోలోని మార్క్స్-లెనిను ఇన్స్టిట్యూటులోని ఒక సభ్యునితో ఈవిషయాల్నిగురించి సంప్రదించేము. వా[illegible] డిచ్చిన సమాధానం ఇది. "బ్రిటిషుప్రభుత్వంతో సోవియటుప్రభుత్వాన్ని పోల్చడం నిజంగా పక్షపాతమే. ప్రపంచంలోని భూభాగంలో ఆరవవంతు భాగాన్ని ఆక్రమించుకొని, అనేకజాతి మతభేదములుగల నాగరిక-అనాగరికజాతులతో సమ్మిళితమై ౧౭ కోట్ల జనసంఖ్యగల సోవియటురష్యాను బ్రిటిషు సామ్రాజ్యం అంతటితోను పోల్చక సోవియటురష్యాలో పదవభాగమంత కూడాలేక నాగరికులగు ౪ కోట్ల జనసంఖ్య మాత్రమేగల ఇంగ్లాండుతో పోల్చడం చాలా అన్యాయం. అదీగాక, సోవియటుప్రభుత్వం అధికారంలోకి వచ్చి యింకా ౨౦ ఏళ్ళుకూడా పూర్తి కాలేదు. అయితేనేం, న్యాయవిధానంలోను, ప్రజాపరిపాలనావిషయంలోను, U. S. S. R. కు బ్రిటిషుసామ్రాజ్యానికీ గల అంతరం ఎంతవుందో చూడండి."

"మీభగవంతుని దృష్టిలో అందరము సమానులమే యని మీరు చెప్పుతారు. మానవసమాజంలో ఒకరి ఎక్కువ-తక్కువలు లేవని చెప్పుతారు. అమెరికా-ఫ్రాంసు మొదలైన దేశాలన్నీకూడా ఈ మాదిరిగానే ప్రకటనలు చేస్తూంటాయి. కాని క్రియలో ఇవన్నీ సున్న. విశాలమైన ఈసోవియటుయూనియనులోని ప్రజలందరికీ వోటింగుహక్కునిచ్చేము. హెచ్చుతగ్గులు లేకుండా అందరికీ ఒకేచట్టం ఏర్పరచేము. జాతి-మతభేదాలు లేకుండా అందరికీ విద్యాసౌకర్యాలు సమానంగా కలుగచేశాము. అనేకవిషయాలలో వెనుకబడియున్న జాతులన్నిటిని నాగరికజాతులతో సమానంగా చేయడానికి ప్రయత్నిస్తున్నాము. ఈ ౨౦ ఏళ్ళనుంచీ చేస్తూన్న సామాజికపునర్నిర్మాణంలో అనేక పొరపాట్లు గలవని మమ్మల్ని నిరసించవచ్చును. కాని మాప్రశ్నలు కొన్నిటికి సమాధానం

ఈయండి. ౨౦౦ సంవత్సరాలనుండి ఆంగ్లేయులు అనేకదేశాలను లోబరచుకొని పరిపాలిస్తున్నారు. ఈ ౨౦౦ ఏండ్లలో పరిపాలితదేశాల ప్రజలకు బ్రిటిషుపాలన వలన కల్గిగిన ఫలితాలు ఏమిటి ? బ్రిటిషు ప్రభుత్వం "పీనల్–లా' లతో ఐరిష–కేథలిక్కులను ఎంతక్రూరంగా అణచి వేసింది ? స్కాట్లండులోని జాకోబీలను "గ్లెంకో–కుల్లోడిన్" మొదలయినచోట్ల ఏవిధంగా సంహారించిందో మీకు తెలియదూ ? ౧౮–౧౯ శతాబ్దాలలో వారు సాగించిన బానిసవ్యాపారానికి వారేమి సమాధానం ఇస్తారు ? ఆస్ట్రేలియా ఆదిమనివాసులు ఏవిధంగా ఆదరించబడ్డారు ? బ్రిటిషు ఓడలలో పశ్చిమఇండియాదీవులకి తీసుకొనిపోబడిన నీగ్రో సంతతికి ఎటువంటి నాగరికత నేర్పబడింది. 'కెన్యా'–'కేప్‌కాలనీ' మొదలగు దక్షిణాఫ్రికాప్రజాస్వామికములలోని ఆఫ్రికనులకు రాజకీయ–సామాజికస్వాతంత్ర్యం ఉన్నదా ? భారతీయులు ౧౮౫౭ లో స్వాతంత్ర్యం కోసం చేసిన యుద్ధాన్ని అతిక్రూరంగా అణచివేయడం ఎంతవరకు న్యాయసమ్మతము ? ఈతిరుగుబాటు తరువాత ౬౦ ఏండ్లకు ౧౯౧౯లో అమృతసరులో (జలియనువాలాబాగ్) చేసిన దురంతాలకి సమాధానం ఏమిటి ? అదంతా ఎందుకు? ఈరోజున భారతదేశస్వాతంత్ర్యంకోసం పని చేసినందుకై ఎన్నివేలమంది దేశభక్తులు ఏవిధమైన విచారణ కూడా లేకుండా జైళ్ళలో నానాబాధలకు లోనుచేయబడుతున్నారో మీరెరుగుదురా? భారతదేశంలోను, ఆఫ్రికాలోను గల అనేకకోట్ల ప్రజలకి ఏవిధమైనరాజకీయ ఆర్థికస్వాతంత్ర్యమును ఈయకుండా అణచిఉంచడానికి కారణం ఏమిటి ? సోవియటుప్రభుత్వం అధీనంలో కూడా ఎన్నడూ నాగరికప్రపంచం ముఖంకూడా చూచియుండని ఉత్తరధృవవాసులు, సైబీరియనులు, ఉన్నారు. మంగోలియనులు ఉన్నారు. మధ్యఆశియాలోని అనేకజాతులు న్నాయి. ఈఅనాగరికజాతు లన్నిటిని మా సోవియటుప్రభుత్వం పరిపాలి

స్తూన్న విధానాన్ని. తన పాలితప్రజల్ని క్రైస్తవప్రభుత్వం ఆచరిస్తూన్న విధానాన్ని ఒక్కమారు పోల్చిచూసుకోండి. మాసోవియటు ప్రభుత్వమే ఉత్తమోత్తమంగా పరిపాలిస్తూంది. పక్షపాతంలేని న్యాయవాది ఎవ్వరైనా ఈవిషయం అంగీకరించి తీరుతాడు. ప్రాపంచకచరిత్రలో ఈవిషయం సువర్ణాక్షరాలతో వ్రాయబడుతుంది."